శ్రీ

శ్రీమతే రామానుజాయనమః.

Sri Bhaktamritam

# శ్రీ భక్తామృతము.

ఇది

భక్తవిజయము

శ్రీరామాయణ సారసంగ్రహము

మొదలగు గ్రంథములకుఁ గృతికర్తయగు

## కోయిల్ - ధనాల -
## దేవరాజదాసులవారిచే

రచింపఁబడి,

Devaraja Dasa

S1.no. 198

మేనలూరు -

Acc. no. 2662

కృష్ణస్వామినాయనిచే

చెన్నపురి

గ్రేవ్సు కూక్‌సన్ అండు కంపెని

స్కాటిష్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

హేవళంబి సం॥

క్రయము అణాలు ౮.



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ భక్తామృతము.



భక్తవిజయము

శ్రీరామాయణ సారసంగ్రహము

మొదలగు గ్రంథములకుఁ గృతికర్తయగు

## కోయిల్ - ధనాల -
## దేవరాజదాసులవారిచే

రచింపఁబడి,



మైనలూరు

కృష్ణస్వామినాయనిచే

చెన్నపురి

గ్రేవ్స్ కూక్సన్ అండు కంపెని

స్కాటిష్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

[illegible] సం॥

[illegible] ౪.



అస్మద్గురుభ్యోనమః.

శ్రీమతే రామానుజాయనమః.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# శ్రీ భ క్తా మృ త ము.

శ్లో॥ శ్రీమచ్ఛ్రీశైలవంశాబ్ధి । రాకాశారదచంద్రమాః । శ్రీమ
ద్వేంకటతాతార్యో । జీయాన్మన్మానసాంబుజే ॥

శ్లో॥ శ్రీవత్సవంశాంబుధిపూర్ణచంద్రం । శ్రీవేంకటాచార్యసుతం
మమేశం । వాత్సల్యసౌశీల్యగుణాంబురాశిం । శ్రీమన్నృ
సింహార్యమహంనమామి ॥

శ్లో॥ నమామితంవేంకటతాతదేశికం । నమామిరామానుజ
యోగిపుంగవం । నమామిరంగేశ్వరవల్లభాంతాం । నమా
మిరంగేశయమన్మదీశమ్ ॥

శ్లో॥ శ్రీదేవరాజదరిపూర్ణకృపైకపాత్రం । శ్రీరంగనాథపదపాసీయ
గుణార్ణవాభం । శ్రీమన్నృసింహగురుశేఖరమార్యభాగ్యం ।
శ్రీవేంకటాద్రిగురుపుంగవమాశ్రయామః ॥

గీ॥ విష్ణుభక్తినిధులనిదినుతింగనిన । పరుశభూషణముఖయో
గివరులబుధుల । నాథయామునమునియతినాథగురుల ।
నతులభక్తినిబూజించినుతియొనర్తు ॥

## ద్వి ప ద.

శ్రీవెలయంగనాశ్రితపారిజాతు । శ్రీవేంకటార్యునిశ్రీశైల
వంశ । జలనిధిసోమునసద్గురువర్యుఁ । బలుదెఱంగులమదిభక్తిఁ
బూజించి । పరమగురునిఁగొల్చిపరగసర్వగురు । వరులఁదలఁచి
యతివరునిఁకెలంగి । శ్రీమంతుఁబూర్ణార్యసేవించిభక్తి । యామున
నాదార్యునినభినుతిసేసి । శ్రీరామమిశ్రునిఁశేమోడ్చిమ్రొక్కి ।
యాపసిపుండరీకాక్షుఁజింతించి । శ్రీనాథమునిఁబాదిశ్రీశఠవైరి ।
మానకవినుతించిమదినినేనెఱు । దదయకనిల్పిశ్రీతరుణిభజించి ।
కడుభక్తిశ్రీధరుఁగరముసేవింతు ॥

కం॥ శ్రీతారకనాయుండగు । సీతానాయకునిదివ్యశీతలకరుణా ।
భూతలమునరచియించెదఁ । పాతకవనదావవహ్నిభక్తామృ
తముఁ ॥

కం॥ వనజద్వయమైమణియును । ఘనజద్వయమైమనోజ్ఞవామన
విభుఁడై । తనరఁగరామత్రయమై । మనుపనెమహిఁగృష్ణ
కల్కిమంజులవేషా ॥

కం॥ కరిభూధరశిఖరంబునఁ । గరుణాలయుఁడగుచుభక్తులఁగా
చురమేశా । వరదాయుదమునవాప్యా । త్సరసీరుహామునవ
సించుసాకేశా ॥

# అవధరింపుము.

హిందుస్థాని తోడిరాగము - ఆదితాళము.

పల్లవి.

స్తుతియొనర్పుమనసా । ఆచార్యుని । స్తుతియొనర్పుమనసా ॥

అనుపల్లవి.

క్షితిశాస్త్రహస్తము । చేనుద్ధరించెను । పతితులనుగృపను ॥ ఆచా
ర్యుని॥ స్తుతి॥

చరణములు.

భవసాగరస్థులఁ । బరమపదముఁ జేర్ప । భువినవతరించిన ॥ ఆచా
ర్యుని॥ స్తుతి॥

ఆత్మలాభంబును । హరికొసంగిన । యాత్మగుణాంబుధిని ॥ ఆచా
ర్యుని॥ స్తుతి॥

ఈశ్వరలాభము । నిచ్చి చేతనులను । శాశ్వతగతిఁ జేర్చిన॥ ఆచా
ర్యుని॥ స్తుతి॥

సాకేతేశ్వరు । సాధువ్యాగ్రహాలను । శ్రీకరముగఁ జేర్చిన ॥ ఆచా
ర్యుని॥ స్తుతి॥ ౧॥

ఆనందభైరవి రాగము - రూపకతాళము.

పల్లవి.

హరియేయాచార్యుఁడయ్యెను । జనులారవినుఁడు । హరియేయా
చార్యుఁడయ్యెను॥

అనుపల్లవి.

ధరణిఁబుట్టియనుమొనర్చి । తద్దయునుభయంబువిడిచి ।
పరోక్షమునందుఁబడెడు । నరులనుద్ధరింపఁబూని ॥ హరియే॥

చరణములు.

నారాయణుండుగరుణను। మహిలోకమిగుల। నరకభీరువులను
బ్రోవను।
కోరిమనుజుండగుచుజన్మ। వారినిధినిమగ్నులకును।
గౌరవమునకొంత్రప్రాణిం। గరమునొసంగియుద్ధరించె॥ హరియే॥
మృగరాజులసువుపంటిన। క్రిమికులంబు। జగతినుండియున్న తం
బగు।
నగమునకునుదాటునట్లు। వలినిగురువునాశ్రయించి।
మిగులంబరతంత్రులగువారు। నిగమవేద్యుంజేరవచ్చు॥ హరియే॥
జ్ఞానకర్మపక్షయుగ్మ రహు। కలిగిపక్షి। చందమునగురుండుశ్రీహరి।
స్థానమునకునెగయుభిన్న। హైననావనెక్కినట్లు।
జ్ఞానహీనగురునింజేరు। జనుండుసంసారాబ్ధింగూలు॥ హరియే॥
కామక్రోధాద్యరిషడ్వర్గము।చేతంజిక్కి। కరముకష్టపడినవారలు।
శ్రీమదాంధులగుమకాల। క్షేమమవనింజేయందగదు।
ఈమహినిదేశికభక్తుంసా। కేతనాయకుండుగైకొనును॥ హ॥

నాథనామక్రియ రాగము - అటతాళము.

పల్లవి.

చిత్రశిఖయమ్ముంభావిగురుండు। నను। మిత్రనికృపంజూచెసా
కేతవిభుండు॥

అనుపల్లవి.

చిత్తనదిత్తునారములు। శ్రీచిత్రజగురుండునారాయణుండ
నిశా॥ ... చి॥

చ ర ణ ము లు.

ప్రణవార్థమునుమున్ను తెలిపి । నమః । పదముచేస్వాతంత్ర్యము
నుబాపినారా ।

యణపదమునువిప్పిచెప్పితుదినాయపదార్థనిష్ఠనిగనజ్జేసె ॥ య ॥

ప్రణవకోదండముఁబట్టి । శ్రీ । పతిరంగశయనులక్ష్యంబుగఁజేసి ।

గుణమునసస్త్రముగాను । నన్ను । గోరిసంధించిప్రయోగించె
మించి ॥ యతి ॥

తిరుమంత్రముననన్నుఁగాంచి । మంత్ర । పరమగుద్వయమునవార
దుఁడై పెంచి ।

ధరణిరంగపురిశుఁడైన । శ్రీ । వరునకుధారపోసియొసంగఁబ్రీతి ॥

ఆత్మలాభముకంటెహరికి । భువి । వరసినగొప్పలాభములేదుగాన ।

నాత్మనకించనునన్ను । శ్రీ । హరికిసమర్పింపఁదలపోసెఁగరుణ ॥ య ॥

నారాయణుండుందువిధము । మరి । నారసిచూచినవారికినంధ ।

కారమేకాంతముతెమిర్గ్రాసావ । ధీరువుగమ్మనెఁగూరిమితోడ ॥ య ॥

పిత్రాద్యర్థంబుస్వార్జితము । లేని । పేదనయినన్నుఁగరుణించిహస్త ।

ధాత్రీధరమునసిద్ధుత్త । హైన । పైకామహాధనంబుఁదయతోఁద
ఁజాసె ॥ యతి ॥

శ్రీశ్రీసైన్యనాయకులో । భువి । శ్రీశఠారియతీంద్రజామాతృ
మునులో ।

శ్రీశఠమష్టగురుకులమునందు । శ్రీమద్వేంకటనాథదేశికుడైరి ॥ యతి ॥

హిందుస్థాని కాపిరాగము - ఆదితాళము.

ప ల్ల వి.

పరయోగీంద్రం । సదావందేహం । పరయోగీంద్రం ॥

అ ను ప ల్ల వి.

[illegible]వాధీనస్వభక్తం । సదావందేహం । పరయోగీంద్రం ।

చరణములు.

సుందరజామాతృమునిం। సూరిజనస్తుతసద్గుణరాశిం॥వరయో॥
ధీభక్త్యాదిగుణాబ్ధిం। దేవదేవపదపంకజభృంగం॥ వరయో॥
అష్టదిగ్గజసేవ్యమానం। యతిరాజప్రవణంమునినాథం॥వరయో॥
రంగనాథగురువర్యం। సంగరహితబుధవందితచరణం॥ వరయో॥
సాకేతేశావరజం। సజ్జనమానసకుముదశశాంకం॥ వరయో॥౨॥

కమాసురాగము - ఆదితాళము.

పల్లవి.

శ్రీమణవాళముని। శ్రీకరముగఁబ్రోవుముసుభక్తునిగృప॥ శ్రీ॥

చరణములు.

నాగాధిపువంశంబునఁబుట్టి। నరులకునుజ్ఞానమొసఁగినట్టి॥ శ్రీమ॥
శ్రీశైలేశదయాపాత్రుండై। శ్రీయతీంద్రప్రవణుఁడవై తివి॥ శ్రీమ॥
ధీభక్త్యాదిగుణార్ణుఁడవైనయో। దేవారమ్యజామాతృమునీంద్ర॥
శ్రీశఠకోపశ్రీసూక్తిభాష్యమును। శ్రీరంగేశ్వరునికివినుపించిన॥
లోకదేశికకృతరహస్యముల। లోకంబునవిశదీకరించిన॥శ్రీమ॥
ధరసాకేతేశునికనుజుండై। దక్షిణహస్తంబై మహాగాదిన॥ శ్రీ॥

హిందుస్థాని కాపిరాగము - ఆదితాళము.

పల్లవి.

లోకగురునివందింతు। ప్రాకటముగనుతియింతు॥

అనుపల్లవి.

శ్రీకరముగహస్తిగిరీశాంశజ। శ్రీపాదంబులఁజేరిసద్భక్తిని॥ లో॥

చరణములు.

అష్టాదశరహస్యంబులఁజెప్పిన। శిష్యజనాగ్రేసరుగురుపుంగవు॥

సౌమ్యజామాతృ యోగీంద్రపరమగురు । రమ్యగుణాంబుధియ
గు బుధవందితు ॥ లోక॥

కృష్ణపాదసత్పుత్రుని శ్రీమ । ద్విష్ణులోకసన్మార్గదాయియగు ॥లో॥

శ్రీమద్వచనభూషణశాస్త్రము చే । భీమభవాబ్ధిమగ్నులనుద్ధరించిన ॥

జ్ఞానదీపము చే నరజనులకు । మానుగ సాకేతేశుని జూపిన ॥లోక॥

బ్యాగు రాగము - ఆది తాళము.

పల్లవి.

వేదాంతదేశిక । కౌశిక వేదాంతదేశిక ॥

అనుపల్లవి.

వేదాంతవేద్యుని । పాదుకాస్తుతిం జేసి ।

గోదాస్తుతి మొనర్చు । గురువర్యోత్తమ ॥ ఉత్తమ॥ వేదాంత॥

చరణములు.

ధారుణిసర్వతం । త్రస్వతంత్రుండైన ।

వైరాగ్యభూషణ । వైష్ణవకులోత్తమ ॥ ఉత్తమ॥ వేదాంత॥

విజ్ఞానసాగర । సుజ్ఞానమొసంగినా ।

యజ్ఞానమును బాపు । మహనీసురోత్తమ ॥ ఉత్తమ॥ వేదాంత॥

ద్రవిడోపనిషత్తా । త్పర్యగాథావళి ।

భువిబుధులకొసంగిన । బుధవర్యోత్తమ ॥ ఉత్తమ॥ వేదాంత॥

కవితార్కికసింహ । కల్యాణగుణశాలి ।

కవికులశేఖర । కౌశికవంశోత్తమ ॥ ఉత్తమ॥ వేదాంత॥

సాకేతాధిపభక్త । సద్గోష్ఠినను జేర్చి ।

ఛీకరాఘముం బాపుం । జేర్మిశోకోత్తమ ॥ఉత్తమ॥ వేదాంత॥౭॥

పూరి కల్యాణి రాగము - ఆది తాళము.

పల్లవి.

రాజా శ్రీయతిరాజా । మనుగాపుము । రాజా శ్రీయతిరాజా ॥

అనుపల్లవి.

భూజనులనుగృపఁ । బ్రోచినదేవ ॥ రాజా॥

చరణములు.

బాదరాయణుమాత్ర । భాష్యకారుఁడై ।
మేదినిఁబ్రోచిన । మేటిగురూత్తమ ॥ రాజా॥
అవనిబాధ్యలై । నాడిదుర్మతముల ।
నవలీలఁద్రుంచిన । యద్భుతవిక్రమ ॥ రాజా॥
మహిఁశ్రీవైకుంఠ । మార్గదాయియగు ।
నహిపత్యంశజ । యతికులశేఖర ॥ రాజా॥
ధరదిగ్విజయముఁ । దద్దయుఁజేసిశ్రీ ।
ధరునికినానం । దంబునొసంగిన ॥ రాజా॥
విశిష్టాద్వైతము । వేడుకవెలయించి ।
యశముఁగాంచినగీ । తార్థప్రకాశక ॥ రాజా॥
సాకేతాధీ । శ్వరసహోదర ।
భీకరభవరోగ । భిషగాధీశ్వర ॥ రాజా॥ రా॥

బిలహరి రాగము - చాపుతాళము.

పల్లవి.

భక్తవత్సలా । భాష్యకారనీ ।
భక్తునన్నుఁబ్రోవునిన్ను । భక్తిఁగొల్చెదఁ ॥

చరణములు.

జగతిజీవుల । శాస్త్రపాణిచే ।
మిగులఁగరుణనుద్ధరించి । మెరసినావయా ॥ భక్తవత్సలా॥
ఆత్మలాభము । హరికినొసఁగియా ।
యాత్మలకును భగవల్లాభ । మవనినొసఁగితా ॥ భక్తవత్సలా॥

సుందరాంగనీ । మందహాసవదనా ।
యిందిరేశభక్తజలధి । కిందుబింబమా ॥ భక్తవత్సలా ॥
కేశవాత్మజ । కృపసన్నిలుము ।
శ్రీశభక్తబృందమందుఁ । జేర్చు వేగమే ॥ భక్తవత్సలా ॥
నీదుకరుణనా । మీఁదఁజల్లిన౯ ।
సాదరముగసాకేత । స్వామిచేకొను౯ ॥ భక్తవత్సలా ॥ ౯ ॥

## భైరవిరాగము - అటతాళము.

### పల్లవి.

వకుళాభరణా । సజ్జనరమణా । వకుళాభరణా ॥

### అనుపల్లవి.

సకలాత్మలకును । సద్గతిఁజూపిన ।
అకలంకకారు । ణ్యాంబుధిగుణనిధి ॥ వకు ॥

### చరణములు.

క్షితిభవార్ణవపతితజనులకుఁ । బార్థసారథిరైన దేవ ।
పతిదివ్యాజ్ఞశిరమునఁదాల్చి । భక్తినావనొసఁగినదేవ ॥ వకు ॥
భక్తజనములచిత్తభిత్తిని । భక్తిచిత్రముఁవ్రాయుతూలిక ।
ముక్తిమార్గముమాకుఁజూపెడి । ముదమునసనుసీహస్తముద్రిక ॥
చతుర్వేదంబులద్రవిడభాషను । జతురతనుప్రబంధీకరించి ।
నతజనులకుసుజ్ఞానదీపము । నయముగానొసఁగితివిమించి ॥ వకు ॥
ఇలనుసాకేతేశుఁబదముల । వెలమిజీవాబ్జములనర్పించి ।
వెలసితివికురుకాధినాయక । విష్ణుసద్భక్తిప్రదాయక ॥ వకు ॥ ౧౦ ॥

## పున్నాగవరాళిరాగము - రూపకతాళము.

### పల్లవి.

నినుకంటివేడుకొంటి । మనఁగంటిశరణంటి ॥

అనుపల్లవి.

దినకరతేజుండవగు । దేవాశఠకోపా ॥ నిను॥

చరణములు.

కారిమారకుమార । కమనీయగుణాబ్ధే ।
ధారుణీద్రవిడామ్నాయను । ధనుభక్తులకొసఁగినపతి ॥ నిను॥
భవసాగరమగ్నులక్రీ । పతిఁజేర్పఁగఁబూని ।
భువిఁగురుకాపురవరమునఁ । బుట్టితివో దేవా ॥ నిను॥
మునునాథమునీంద్రునకును । మమరాజముయోగంబును ।
దనరఁభవిష్యద్గురువర । ఘనవిగ్రహమునొసంగిన ॥ నిను॥
సాకేతేశునిసజ్జన । జంగమవృద్ధుమహాల ।
శ్రీకరముగనెలకొల్పిన । శ్రీవకుళాభరణా ॥ నిను॥ ౧౧॥

ఆరభిరాగము - త్రిపుటతాళము.

పల్లవి.

వందనముశ్రీయంజనాసుత । వందనమువాతాత్మజ ।
వందనముఘటికాద్రినిలయ । వందనంబుచతుర్భుజ॥ రామదూత॥

చరణములు.

పుట్టినప్పుడెసూర్యుఁబొడగని । అట్టిమింటికెగసివే ।
పట్టుకొంటివిముంచికొండని । ఎట్టిధైర్యమొకపివర॥ రామదూత॥
జలధిగోష్పదముగనుదాటి । జనకకులసుందరిఁగని ।
చెలఁగనుంగరమిచ్చిస్వామికి । సీతశిరోమణిఁదెచ్చితో ॥ రామ॥
రామసోదరుమూర్ఛఁదీర్పఁగ । రయమునను సంజీవనిఁ ।
రాముఁడలరఁగఁగంటుక్రియ । సేమమునఁ దెచ్చితో ॥ రామదూ॥
నీవుసాకేతేశుసన్నిధి । నేమముగనియామ్మను ।
సావధానంబుగనర్పింతుము । శంఖచక్రధరాహరి ॥ రామ॥ ౧౨॥

శంకరాభరణరాగము - రూపకతాళము.

పల్లవి.

శ్రీరామభటాగ్రేసర శ్రీరామభటాగ్రేసర ।
శ్రీరామభటాగ్రేసర శ్రీమారుతతనయా॥

చరణములు.

శ్రీరామపదాశ్రితుఁడై । సీతకుముదమునొసంగిన ॥ శ్రీరామ॥
వారాశినిగోష్పదముగ । ధీరుఁడవై దాటినహరి ॥ శ్రీరామ॥
యోగన్నృకేసరికెదుటను । యోగాసనమునసుండెడు॥ శ్రీరామ॥
అనవరతముశ్రీతారక । మనురాజముజపియించెడు ॥ శ్రీరామ॥
బ్రహ్మవిద్యనురామునిచే । బరమముదంబునఁజెందిన ॥ శ్రీరామ॥
చతుర్భుజుఁడై ఘటికాద్రిని । శంఖచక్రంబులఁదాల్చిన॥ శ్రీరామ॥
సూర్యునికెదుటనుబోవుచు । నూటిగవిద్యనుజెందిన ॥ శ్రీరామ॥
మశకీకృతదశకంఠా । మహిశంకరదేవాంశజ ॥ శ్రీరామ॥
లంకాభయంకరుఁడై సుర । సంకటమునుదొలఁగించిన ॥ శ్రీరా॥
సాకేతపురాధీశ్వరు । సచ్ఛిష్యుఁడనన్నేలుము ॥ శ్రీరామ॥ ౧౩॥

సావేరిరాగము - ఆదితాళము.

పల్లవి.

అంజనాసుత । హరికులశేఖర । అలఘుటికాచలనిలయా ॥

అనుపల్లవి.

సంజీవనిగిరినంతసమునఁదెచ్చి । సౌమిత్రికిమూర్ఛనుపోఁగొట్టిన॥

చరణములు.

శంకరునంశంబుననునిలునికం । జనగర్భంబునఁదగనుదయించి ।
శంకలేకరవికెదుటనుబిరిదిశ । జనుచువిద్యలనుతెలియగ్రహిం
చిన - అంజ॥

రామునిబనుపునసాగరంబునతి । రయమునఖగపతివలెదాటి ।
యామహోదధినిమైనాకార్చితుఁ । డై సురసాహింహికలని
ర్జించిన ॥ అంజ॥
జానకికలరామాంకితముద్రికఁ।జతురతనొసఁగియశోకవనంబును।
మానుగఁజెరికిరక్కసులఁగూల్చిలం । కానగరమునగ్నికినర్పిం
చిన ॥ అంజ॥
సీతశిరోమణిరామునికర్పించి । మాతృద్రోహిరావణుఁజంపించి ।
నీతిగఁబట్టాభిరాముఁడైనరాము । నీరజపాదచ్ఛాయమైవెల
సిన ॥ అంజ॥
నిగమవేద్యుఁడగునీరజకులజుని।భగవంతునిసత్కృపకులత్యమై ।
ఖగరాడ్వాహనుఁడగురామునిచే । ఘనతారకమనురాజముఁ
బడసిన ॥ అంజ॥
పాకశాసనాదులగతిుంచి । బ్రహ్మర్షిద్వేషులశిక్షించి ।
సాకేతపురాధీశుఁడైనశ్రీజానకీశునకుఁగూర్మిభటుండగు ॥ అం॥

బ్యాగుర-గము - రూపకతాళము.

పల్లవి.

కరుణనన్నుఁజూడుమమ్మగోదనాయకి । శ్రీగోదనాయకి ॥

అనుపల్లవి.

ధరణియంశమునసుదులసి । గరుణఁబుట్టితా ।
వరరంగేశుమందిరమును । వరలమెట్టితొ ।
నాయకుమునెట్టితొ ॥ కరుణ॥

చరణములు.

ఆరయకనేఁజేసినాఁడ । నాత్మచౌర్యము ।
కూరిమితోఁగూల్పుమీనొప్పక్రౌర్యము ।
నాకొసఁగుధైర్యము ॥ కరుణ॥

అరిషడ్వర్గబాధనోర్వనమ్మఁగష్టము ।
హరిపదములనన్నుఁజేర్తువనుటస్పష్టము ।
నాకిదియఁబిష్టము ॥ కరుణ॥
అరయభగవద్భక్తినాయందులోపము ।
హరికినిట్టిఖలునిమీఁదనధికకోపము ।
ఇమ్ముజ్ఞానదీపము ॥ కరుణ॥
కరమువైష్ణవులకునీవుకల్పభూజము ।
వరగనీదుగాథవిష్ణుభక్తిబీజము ।
ఇంతయునునైజము ॥ కరుణ॥
నీవుపాడినట్టిపాటనిగమసారము ।
దేవదేవభటులఁజేర్చువిరజాతీరము ।
ఇదిముక్తిద్వారము ॥ కరుణ॥
ఆముక్తమాల్యదయానీయంఘ్రిఁగూడెద ।
నేమముతోనన్నిప్పుడెబ్రోవనిన్నువేడెద ।
సీమహిమఁబాడెద ॥ కరుణ॥
దయనన్నరసివేగముగనాతాపమ్మార్పుము ।
హాయవదనుసాకేతభక్తయంఘ్రిఁజేర్పుము ।
నీకరుణఁగూర్పుము ॥ కరుణ॥ ౧౫॥

యదుకులకాంభోజిరాగము - అటతాళము.

పల్లవి.

జన్మసాఫల్యమగుజనులారవినుఁడీ ॥

అనుపల్లవి.

మన్మనాభవయనిసమాధవునిసేఁగొల్వ ॥ జన్మ॥

చరణములు.

విషయవాంఛలనెల్లవేరుతోఁదెగఁగోసి । విష్ణుభక్తినిగోదాదేవి
గొలుఁడు ।

విషధరకాళియాహిని దర్పమణంచిన । వెన్నునికిరాముక్తమాల్యమి
దనుబోగడిన ॥ జన్మ॥

నూటనల్బదియూడుమేటిపాటలఁబాడి । సోముకై తిరుప్పావై నే
మముతోఁజెప్పి ।

నూటిగరంగనాథునిరాణియైదివ్య । సూరులకుఁగులదైవమైనదే
విని గొల్వ ॥ జన్మ॥

భూమ్యంశమునఁదులసిఁబుట్టి పెరియాళ్వారు । పుత్రినాఁబెరిగిశ్రీ
రామానుజార్యుని ।

రమ్యసహోదరియైరమ్యజామాతృనిరాణియైమనల నేలినగో
దఁగొల్చిన ॥ జన్మ॥

నాకేశముఖులద్భుతంబందశ్రీరంగ । నాయకునిఁజేపట్టిపటవస్త్ర
శాయిని ।

సాకేతపతిమనఃప్రియునిసఖులంగూడి । చయ్యనధను ర్మాసమున
గ్రుంకినోచెను ॥ జన్మ॥ ౧౩॥

యదుకులకాంభోజిరాగము - రూపకతాళము.

పల్లవి.

కావుమమ్మతులసినాయకి । నతునినన్నుఁ । గరుణఁజూడుము క్తి
దాయకి ॥

చరణములు.

దీనజనులఁగరుణతోడను । బ్రోవఁదలఁచి । దివ్యవృక్షరూపి
వైతివి ॥ కావు॥

భావజునిచే బాధపడితిని । తల్లినన్నుఁ । బాలింపుముకరుణతో
డను ॥ కావు॥

శామూది శీకరారుల । చేతఁజిక్కి । కరముకష్టమనుభవించితి ॥

నిన్నెతింగిస్తుతియొనర్పఁగ । నేర్వఁదలచతుర్ముఖుఁడుపఱుతను
నాయకీరంగనాయకీ ।

ధన్యులెవరుంకఁగాపురమువృఁదు । మన్ననముభరాపుత్రిమైథిలినాయ
కీరంగనాయకీ ॥

పురుషరూపములన్నియునుశ్రీ । పుష్కరాక్షునిదివ్యమూర్తులు
నాయకీరంగనాయకీ ।

కరము స్త్రీరూపంబులన్నియుఁ । గంబుకంఠీనీదుమూర్తులో నా
యకీరంగనాయకీ ॥

స్వామిరాముండైనసీతవై । జగతినెంతయుఖ్యాతిఁగాంచిననా
యకీరంగనాయకీ ।

స్వామికృష్ణుండైననిబ్బవి । భీష్మసుతయగురుక్మిణైతివినాయకీ
రంగనాయకీ ॥

దేవరూపముఁదాల్చుభర్తను । దేవరూపముచేతఁగొల్తువునా
యకీరంగనాయకీ ।

ఈవుమానుషివగుదువలసా । కేశవతిమనుజుఁడగునప్పుడునా
యకీరంగనాయకీ ॥ ౧౮.

కల్యాణిరాగము - అటతాళము.

పల్లవి.

సకలేశ్వరీయల్లిక్కేఁణినుండెదుతల్లి । శుకవాహానునితల్లిశ్రీవేదవల్లి ॥

చరణములు.

నాకభయంబిమ్ముతామసించకలెమ్ము । శ్రీకరంబుగరమ్ముచేపట్టు నీసొమ్ము ॥ సక ॥ ఇంద్రియములబాధనోర్వలేనోతల్లి । చంద్రసహోదరిననుగన్నతల్లి ॥ సక ॥ భవభీరులగునన్నుభక్తవత్సలు

రాణీ । శివకరముగఁ బ్రోవుమలనీలవేణీ ॥ సక ॥ శరణాగతునిఁ బ్రోవుమఖిలజగన్మాత । సరసిజాసనత్రైమైనసద్గుణోపేత ॥ సక ॥ పాపులలో నగ్రగణ్యుఁడననినన్నుఁ । గోపగింపకుము నేనమ్మితిని న్ను ॥ సక ॥ నాకేశవందితపాదసరోరుహా । నాకుముక్తిఫలం బొసఁగుకల్పభూరుహా ॥ సక ॥ నీకసాధ్యంబొకటిలోకంబుననుగ లదె । సాకేతేశ్వరినతునిరక్షింపవలదె ॥ సక ॥ ౧౯॥

దేశిక తోడిరాగము - రూపకతాళము.

పల్లవి.

అమ్మవేగమె । నా । కిమ్మయభయము ।
రమ్మికావశ్రీ । సీ । తమ్మనూయమ్మ ॥

చరణములు.

స్తనంధయాప్రజ । భువి । సంరక్షింపఁగ । జననికాదెది । న్యా । పథముగ్రోలుట ॥ అమ్మ ॥ నీవునన్నుఁబ్రోవఁ । గదు । నేర్తువనికదా । సేవచేతును । నీ । శ్రీపదాబ్జము ॥ అమ్మ ॥ నుతి నిదోషము । నీవు । చూచిభయపడి । స్వతంత్రుఁ ... ననా । భు నివ । డీమొను శాయవు ॥ అమ్మ ॥ కరుణఁజూడఁగాఁ । గా । కంబుబ్రతికెను । కరుణలేమిరా । వణఁడు । కాలుఁజేరెను ॥ అమ్మ ॥ స్వామిఁజేరికో । పమును । శాంతిచేయుము । స్వామి నీనను । జేసి । జ్ఞానమొసఁగుము ॥ అమ్మ ॥ పురుషోత్తమునిశ్రీ । పాద । పుష్కరమునన్ । అరసిచేర్పసా । కేత । పురవిహా రిణీ ॥ అమ్మ ॥ ౨౦॥

శ్రీరాగము - రూపకతాళము.

పల్లవి.

పరమభాగవతులకు । భక్తివందనంబు సేతు ॥

అనుపల్లవి.

ఉరమునశ్రీ కాంఘ్రిరజము । కరవచనద్రుష్టులచేధరణి ॥ పరమ ॥

చరణములు.

శౌరియూరమునవిహరించెదను । భక్తాలయుయుగుల్మెం । ధర
జితివిళ్ళుదూలుచిలి । దద్దయుగోదాదేవికి ॥ పరమ ॥ గరుడాదిపం
తసేనేశుల । గణనాథులగుముదాదుల । వరచండప్రచండా
దుల । ధరసాగిలపడిమ్రొక్కెద ॥ పరమ ॥ కరయుసురుద్రసు
కీర్తులు । గాంతినివారుణీసూత్రవ । తిరయంబుపవిమరాదుల -
శిరసావందించెదభక్తి ॥ పరమ ॥ సనకసనందప్రముఖులు । సన్మ
నులువసిష్ఠాదులు । ధ్రువప్రహ్లాదాంబరీషరు । క్మాంగదపావనిము
ఖులగు ॥ పరమ ॥ ముదముశఠకోపజిన్ముఖులను । మునినాథుయా
మునుయతిపతి । సదయులసర్వాచార్యుల । సద్భక్తినివందించెద ॥
పరమ ॥ పాండురంగనిపదపంకజ । భక్తులజ్ఞానేశాదుల । పుం
డరీకార్యునిసెంతయు । భువివేమారుమ్రొక్కెద ॥ పరమ ॥
సాకేతపురాధీశుని । సత్కృపచేభాగవతుల । శ్రీకరసద్బృందం
బున । కేరిబడుగులధన్యుఁడనై ॥ పరమ ॥ ౨౧

---

## శ్రీరామావతారము.

కేదారగౌళరాగము - అటతాళము.

పల్లవి.

అవతారముచేసెను । శ్రీరాముఁడు । అవతారముచేసెను ॥

అనుపల్లవి.

అవతారముచేసె । సకలలోకేశుఁడు ।
భువియయోధ్యాపురి । బుధులుసంతసమంద ॥ అవ॥

చరణములు.

బ్రహ్మాదిసురలుసమ్మనుబ్రార్థింపఁగ । పరవాసుదేవుఁడువర
మునుదంబున । బ్రహ్మర్షిద్వేషులసంహారకారణంబు । సరగబుగం

బుణము తొలంగమదినెంచి ॥ అవ ॥ కౌసల్యాపూర్వతంద్యానుగమల
మిశ్రమగాలై । కరముజగత్ప్రశ్నబోధాగ్ని యైమహీ । భాసురముగ
దశరథతపంఫలంబయి । భక్తవత్సలుండగు శ్రీరామభద్రుండు ॥
అవ ॥ సాధుపరిత్రాణమునుదుష్కృతవినా । శంబునుధర్మ
సంస్థాపనమును జేయ । శ్రీధరుండాశ్రితపరతంత్రుండై భువి ।
జెలంగజన్మించెనుమనభాగ్యరాశిరాయి ॥ అవ ॥ సాకేతపురము
నసకలాత్మలనుబ్రోవ । సౌమిత్రిభరతశత్రుఘ్నులతోంగూడి ।
శ్రీకరముగదేవతలువానరులై కొల్వ । శ్రీకంఠవినుతతారకమం
త్రార్థంబయి ॥ అవ ॥ ౨౨॥

భూపాళరాగము - ఆటతాళము - మేలుపలుకు.

ప ల్ల వి.

మేలుకొనుదేవాధినాయక । మేలుకొనుబ్రహ్మాదిపూజిత ।
మేలుకొనునాకేశవందిత । మేలుకొనవే॥ రామా ॥ మేలుకొనవే॥

చ ర ణ ము లు.

మేలుకొనుశ్రీదశరథాత్మజ । మేలుకొనుకౌసల్యసుప్రజ ।
మేలుకొనుశ్రీలక్ష్మణాగ్రజ । మేలుకొనవే ॥ రామా ॥ మేలుకొ
నవే ॥ మేలు ॥ మేలుకొనుమునియాగరక్షక । మేలుకొనుమారీ
చశిక్షక । మేలుకొనుశివచాపఖండన । మేలుకొనవే ॥ రామా॥
మేలుకొనవే ॥ మేలు ॥ మేలుకొనుసీతామనోహర । మేలుకొ
నుజితపరశురామా । మేలుకొనుశ్రీభక్తవత్సల । మేలుకొనవే ॥
రామా ॥ మేలుకొనవే ॥ మేలు ॥ సూర్యుండుదయాచలమునం
జేరెను । నరమునులుహరిహరియనిరొదరు । సూర్యకులదుగ్ధా
బ్ధిసోమ । మేలుకొనవే ॥ రామా ॥ మేలుకొనవే ॥ మేలు ॥
పవనసుతగంధాత్రి శ్రవణులుశ్రీ । శత్రునివిభునోంచాంలౌడుచు ।
సవినయాంజలిబద్ధులైరిదె । మేలుకొనవే ॥ రామా ॥ మేలు

కొనవే ॥ మేలు ॥ సూర్యగంగాసాగరావని । కుధరనలినజశ్రుతులంగ్రహంపులం । సూర్మింబోగడుచువచ్చెనారద । గోవిదుండదు॥ రామా ॥ మేలుకొనవే ॥ మేలు ॥ ధన్యుడునుబరిపూర్ణుడునుభువి । దక్షిణాన్వితయాగభోక్తయు । నన్నుగానెలుగుమని పల్కిన । నలిననాభా । మేలుకొనవే ॥ రామా ॥ మేలుకొనవే ॥ మేలు ॥ మేలుకొనుసాకేతనాయక । మీనముఖదశదివ్యరూప । చాలునికతాలించునిద్రను । మేలుకొనవే ॥ రామా ॥ మేలుకొనవే ॥ మేలు ॥ ౨౩॥

## నాటరాగము - జంపెతాళము.

### చ ర ణ ము లు.

జయపరమపదనాథ । జయజానకీనాథ । జయరుక్మిణీనాథ। జయరంగనాథ ॥ జయజయ ॥ జయపయోదధిశయన । జయసూర్యశశినయన । జయభోగిపతిశయన । జయరంగశయన ॥ జయజయ ॥ జయభవస్తుతనామ । జయసుగుణగణధామ । జయసాధుహృద్ధామ । జయరంగధామ ॥ జయజయ ॥ జయరమాహృదయేశ । జయఉమాప్రాణేశ । జయసర్వలోకేశ । జయసాకేతేశా ॥ జయజయ ॥ ౨౪॥

## ఆనభిరాగము - త్రిపుటతాళము.

### చ ర ణ ము లు.

శరణుదశరథబాలనందన । శరణులక్ష్మణపూర్వజ । శరణుకౌశికయాగరక్షక । శరణుసీతానాయక ॥ శరణుశరణు ॥ శరణుఖరముఖదైత్యభంజన । శరణుపవనసుతారాధిత । శరణురవిసుతభయవిమోచన । శరణుశిక్రమశాంతిత ॥ శరణుశరణు ॥ శరణుశ్రీశ్రవణాభయప్రద । శరణుశ్రితజనవత్సల । శరణుసాగర

గర్వభంజన। శరణుదశకంఠాంతక ॥ శరణుశరణు ॥ శరణువా
శీనాధసంస్తుత । శరణుసాకేతాధిప । శరణుభవస్తుతనామకా।
శరణుముక్తిప్రదాయక ॥ శరణుశరణు ॥ ౫॥

సౌరాష్ట్రికరాగము - రూపకతాళము - హెచ్చరిక.

చరణములు.

రక్షింపుమురంగేశ్వర । రమణీయగుణాఢ్యే । శిక్షింపుముకా
మాదుల । శ్రీశాహెచ్చరిక । జగ । ధీశాహెచ్చరిక ॥ శ్రీవేం
కటగిరినాయక । శ్రీకమలానాథా । శ్రీవత్సాంకితవక్షా । శ్రీశా
హెచ్చరిక । స । ర్వేశాహెచ్చరిక ॥ వారణగిరినాయకశ్రీ ।
తారకదివ్యనామా । వారిజభవవినుతాశ్రీ । వరదాహెచ్చరిక।
శరి । వరదాహెచ్చరికా ॥ యదుభూధరశిఖరాలయ । యాద
వకులతిలకా । సదయుఁడవైననుబ్రోవుము । స్వామీహెచ్చ
రిక । మ । త్స్వామీహెచ్చరిక ॥ వరబృందావననిలయా । వసు
దేవతనూజా । సరసిజనయనాపార్థ । సారధిహెచ్చరిక । గుణ।
నీరధిహెచ్చరిక ॥ శ్రీమత్సవిత్రీనాయక । శ్రీభక్తవత్సలశ్రీ । రా
మానిస్తులాధీశ్వర । స్వామీహెచ్చరిక । మ। త్స్వామీహెచ్చ
రిక ॥ ఘటికాచలదివ్యాలయ । కరుణనుదక్షిణవేం । కటగిరివి
హారించెడుశ్రీ । కాంతాహెచ్చరిక । మత్కాంతాహెచ్చరిక॥
సాకేతాధీశ్వరశ్రీ । సరసీరుహనాభా । శ్రీకంఠవినుతనామా ।
శ్రీశాహెచ్చరిక । సీ। తేశాహెచ్చరిక ॥ ౬॥

సురటిరాగము - అటతాళము - మంగళము.

చరణములు.

శ్రీరంగవిభునికి । శ్రీమనోహరునికి మంగళం శుభమంగళం ।
శ్రీరంగేశ్వరికిశ్రీ । క్షీరాబ్ధికన్యకు మంగళం శుభమంగళం ॥ శేషా

లని స్తుతించి । పాలింపుము నన్ను । భక్తులగోలు ఘటికాద్రిని । బరగెడు నరసింహ ॥ ధారుణి బృందావనా । ధాత్రీ మతార్థ । సారథి ననురక్షింపుము । స్వామి వేంకటేశా ॥ ఎలమి విభీషణ పార్థుల । కిచ్చిన యభయంబు । ఇలనాకొసంగుమి సాకే । తేశ్వర తగవగునే ॥ ౨౮॥

ఆరభిరాగము - ఆదితాళము.

పల్లవి.

నాయకా రంగనాయకా । కృపఁజూడు । నాయకా రంగనాయకా ॥

అనుపల్లవి.

పాయని కరుణఁ జగంబులఁ బ్రోచుచు ।
భక్తకల్పభూరుహమై వెలసెడు ॥ నాయ ॥

చరణములు.

నాయండలి దురితంబుల నెన్నక । నలినాలయపుర పాకారంబున । నీయఖండ కరుణామృత వృష్టిచే । నిర్మలుఁజేయుము శ్రీ ప్రణవాలయ శ్రీ ॥ నాయకా ॥ తప్పులెంచుట తగవే తండ్రికిఁ । దగును పాయము నఁదనయుని దిద్దక । ఎప్పుడు నన్నే మరకమెలంగుము । ఇంద్రియ దోషముల చేఁ జిక్కక శ్రీ ॥ నాయకా ॥ పతితుఁడని పాలింప వేసినీ । పరమకరుణ జీవింపఁగవలదా । క్షితిని దిక్కు నా కెవరున్నను । తేఁకనుండు సెతల్లి కిదుగ్గము ॥ నాయకా ॥ నేనీసాష్టాని నను యాచించిన । నేన్పరికేల్లి భూతంబులవఁన । మానుగ నభయము నొసంగుదు ననినను । మరచుట తగవే సాకేతేశ్వర ॥ నా ॥

శ్యామరాగము - రూపకతాళము.

పల్లవి.

సంతసము వనన్ను బ్రోవ వేంకటేశ్వరా । శ్రీ । వేంకటేశ్వరా ॥

అనుపల్లవి.

అంతకాంతకుఁడు నుతించు । నామలనామము ।

ఎంతోదయనాహృదయుభక్తి । నెలమిన్రాయుచు ।
కృపాకలితుఁజేయుము ॥ సంతస ॥

చ ర ణ ము లు.

భవభయంబుఁబాపవయ్య । పార్థసారథే । శివముగాన న్నేలుముమా । ధవదయానిధే । దివ్యసుగుణసీరధే ॥ సంత ॥ కరుణసాధుగోష్ఠిఁజేర్పు । కమలలోచన । పరగఁదులసిఁబూజ సేతు । భయవిమోచన । విన్నవింతునూచన ॥ సంత ॥ నన్ను దాసకోటియందొ । నర్పుమేటిగా । సన్నుతింతుభక్తితోడ । నిన్నుధాటిగా । మ్రొక్కెదనుసూటిగా ॥ సంత ॥ గరళమొసఁ గిముక్తిపథముఁ । గాంచెవూతన । కరమునతునిఁగావఁదగదె । గరుడకేతన । శ్రీనికేతన ॥ సంత ॥ ముదముతోనిన్నెరికొలుతు । ముక్తిదాయక । సదయహృదయుఁడగుచుఁబ్రోవు । జాగుచే యక । సాకేతనాయక ॥ సంత ॥ ౩౦॥

కాంభోజిరాగము - ఆదితాళము.

ప ల్ల వి.

వరమునిచ్చుకరిగిరిపతినన్బ్రోవ । వలదెదేవదేవ ॥

అ ను ప ల్ల వి.

పరగసృష్టిస్థితిలయములుసీతా । భర్తసీలీలలుకావాదేవా॥ వర॥

చ ర ణ ము లు.

పరవ్యూహవిభవాంతర్యామ్యర్చ । భవ్యరూపములచేత । కరమునుజగమునుబాలింతువుశ్రీ । కరుణాకరలక్ష్మీశ్వరయీ శ్వర ॥ వరము ॥ కరమునుపాదానిమిత్తసహా । కారికారణము నీవగుచు । పరగజగంబునుబరక్షించెదు । పరమకానర్వేశ్వర యీశ్వర ॥ వరము ॥ ధరణిసూక్ష్మచిదచిద్విశిష్టుఁడై । తద్దయు

సంకల్పవిశిష్టుండై । కరముజ్ఞానశక్త్యాదివిశిష్టుఁడై । పరగుద్రి
విధకారణభవహరణ ॥ వరము ॥ ఆత్మదేహమందుననుమాత్రము
మణు । లందునువెలసెడుభంగి । ఆత్మేశ్వరనీవెందుఁబ్రవేశించి ।
యన్నింటినిధరియింతువుమంతువు ॥ వరము ॥ సాకేతేశ్వరభక్త
వత్సలశ్రీ । జానకీరమణరామా । నాకభయంబునొసంగిరక్షిం
పుము । నారదవీణానాదవినోద ॥ వరము ॥ ౩౮॥

హిందుస్థాని కాపిరాగము - ఆదితాళము.

పల్లవి.

శ్రీసంపత్కుమారుఁడా ॥

అనుపల్లవి.

భాసురముగశరణాగతుఁబ్రోవుము ॥ శ్రీసం ॥

చరణములు.

రామానుజయతిశేఖరునకునతి । ప్రేమనుబుత్రుండైముద
మందిన ॥ శ్రీసం ॥ డిల్లీశ్వరుసుతమహిమీగఁగైకొని । కల్లలేని
కృపజగమునుబ్రోచెదు ॥ శ్రీసం ॥ యదుభూధరశిఖరాలయ
మునవతి । ముదమునవెలకొనిముక్తిప్రదుఁడగు ॥ శ్రీసం ॥ భవ
భీరువునన్నేలుముకృపమా । భవపాపాటవికనలుండగుహరి॥
శ్రీసం ॥ అహింసాద్యష్టపుష్పంబులభక్తితో । మహినిన్నెపు
డును మదినర్పించెద ॥ శ్రీసం ॥ సాకేతేశ్వరశరణాగతునను ।
శ్రీకరముగనీదాసునిఁజేయుము ॥ శ్రీసం॥ ౩౯॥

సావేరిరాగము - ఆదితాళము.

పల్లవి.

పార్థసారథేకరుణాన్వితధే । పుణ్యగుణశీలశాంబుధే ॥

అనుపల్లవి.

తీర్థపాదశిరస్సునితోల । స్థిరముగనన్నేలుకరుణాలవాల ॥పార్థ॥

చరణములు.

దేవకికొడుకుగఁబుట్టియశోదా । దేవి పెనుపఁగోకులమునఁ బెరిగి । దేవారులంబూతనశకటార్జున । ధేనుకబకచాణూరులఁ గూల్చిన ॥ పార్థ ॥ శ్రీధామునికుక్కుటవదరికాఁడై । శ్రీనిధిగుఱుజేఁ బట్టిగోవర్ధన । భూధరమునునొకవ్రేలధరించి । బంధులనుతింప గోపాలురఁబ్రోచిన ॥ పార్థ ॥ ఉద్ధవునికిఁబ్రియసఖుఁడై కాళిం‌ది యుదకంబుననిజదివ్యాకారము । నిద్ధరనక్రూరునికిఁజూపిమధు రేశుఁడై నకంసాధముఁజంపిన ॥ పార్థ ॥ సర్వోపనిషత్తులఁగోవు లుగా । సవ్యసాచివత్సంబుగఁజేసి । ఉర్విగోపాలుఁడై శ్రీగీ తోపనిషద్దుగ్ధంబునుబితికిన ॥ పార్థ ॥ సాధువులకుగీతామృత మొసఁగి । జగతినిధర్మసంస్థాపనంబును । సాధుపరిత్రాణము దుష్కృతవినా । శము జేసివబృందావనలోల ॥ పార్థ ॥ సాకే తపురంబునఁజన్మించి । సన్మునిపుంగవులనురక్షించి । శ్రీకరముగ సర్వాత్మలముక్తులఁజేసినఁరికుఁజన్మలుటకష్టమె ॥ పార్థ ॥ ౩౮ ॥

హిందుస్థాని కాపిరాగము - రూపకతాళము.

పల్లవి.

నారాయణరక్షింపుము । నతునివేగమె ॥ శ్రీమన్ ॥ నారా॥

అనుపల్లవి.

పారావారగంభీర । భక్తవత్సల ॥ శ్రీమన్ ॥ నారా॥

చరణములు.

నిస్త్రలపురివిహారించెదు । సిరజలోచనకరుణను । హాస్తికుని గాచినశ్రియ । నరసింహరూపమున్నను ॥ నారా ॥ సుగన్న తల్లితోముదమున । వస్త్రాలగ్గజనుఁడవై । తనరవరుణకాసా రం । బునజల్లుకీడమునసల్పెదు ॥ నారా ॥ పాలిసిద్ధివ్యాఘ్రమునను ।

మూన్పఁగఁబూని । కల్కియై యెబ్బంగలదేవా ! ఇలనన్ను నకిం చనుగృపచే । నేలుమనన్యగతుని వరసి ॥ శ్రీమ ॥ సాకేతపురాధీశ్వరదా । శరధేవాయుగుణాధీశా । శ్రీశరముగవీపదయుగముఁ । జేర్పుము వేగమునాతలపై ॥ శ్రీమ ॥ 3౫॥

ఆని కాపిరాగము - ఆదితాళము.

పల్లవి.

వేగవచ్చి బ్రోవుము వేణుగోపాలా ! భోగిశయనసద్గుణగణ జాలా ॥

అనుపల్లవి.

సాగరరాజసుతాప్రాణేశ్వర । శ్రీగరుడధ్వజశ్రీగోపాలా ॥

చరణములు.

భక్తవత్సలనాకభయ మొసంగుము । పద్మనేత్రమన్యుక్షేత్రేశ్వర । ముక్తిదాయకశ్రీభగవద్గీశా । మృతదుర్గంబునునాకు నొసంగుము ॥ వేగ ॥ బదరీవనమున నరనారాయణ । భవ్యసుందరమూర్తిద్వయుండై । ముదమున నష్టాక్షరిమంత్రంబును । ముక్తిసాధనంబుగనొసఁగినహరి ॥ వేగ ॥ మంత్రరత్నము శ్రీవైకుంఠంబున । మాను గలక్ష్మికొసఁగియాశ్రితపర । తంత్రుఁడై యభయమునర్జునునకువతి । దయ నొసఁగిన శ్రీవేణుగోపాలా ॥ వేగ॥ నిగమస్తుతవన్నెలమువాధము । వినిసంతసమున నేలినరీతిని । ఖగరాడ్వాహనకౌస్తుభభూషణ । కరుణాసాగర సాకేతేశ్వర ॥

శైవరిరాగము - రూపకతాళము.

పల్లవి.

అపర్యాప్తామృతదేశ । కృపజూడుమా గతివ ॥

అనుపల్లవి.

అపరాధముగనుతింపకఁ । కృప నేలుము దేవదేవ ॥

చ ర ణ ము లు.

కావేరీతీరంబునఁ । గరుణాలయుఁడై నెలకొని । కావవేనతు లనుశరణా । గతునిఁబ్రోవవేలతాల ॥ అప ॥ భీమభవార్ణవమగ్నుం । డై మఱచితిని న్నెంతయు । కామాంధునిఁగరుణింపుము । కోమలవల్లీశయీశ ॥ అప ॥ కూరిమినామనవినిగై । కొను శ్రీకుంభఘోణేశ్వర । నీరై కరిగెడునామది । నిన్నెంతయుఁ దలఁచివలచి ॥ అప ॥ శతకోపవినుతసద్గుణ । సాగరశార్ఙ్గధనుర్ధర । శతుఁడనినతువిడనాడకు । సాకేతపురాధినాధ ॥ అప ॥

ముఖారిరాగము - రూపకతాళము.

ప ల్ల వి.

వీరరాఘవ । నన్నేలుము । వీరరాఘవ

అ ను ప ల్ల వి.

ధారుణివీతూరణ్యమునఁ । గూరిమి నెలకొనికుంభినిఁబ్రోచెదు ॥ వీర ॥

చ ర ణ ము లు.

హృత్తాపవినాశినినై । యొప్పెడుశ్రీకాసారము । నా త్రిఁగునసుతిచేయుదు । నెంతయుఁబొకహారంబగు ॥ వీర ॥ జగతి శాలిగోత్రునియూ । శ్రమమునఁదగశయనించి । మిగులశసంతోషంబునమూ । మేలునుగోరుచునుంటువు ॥ వీర ॥ మఱి కారణ్యాధిపుపుత । మంజులకనకామ్యాయశల్లి । పతిమంతోఁజేపట్టి । పరగనతులకోర్కులొసంగు ॥ వీర ॥ సాకేతపురాధీశ్వర । సజ్జనబృందంబునవను । శ్రీశఠముసుగఁజేర్పుమతగఁ । శ్రీకంఠార్చితపాదా ॥ వీర ॥ ౩౮॥

## మోహనరాగము - త్రిపుటతాళము.

### పల్లవి.

శ్రీమద్రామాయణమహాత్మ్యము । చెప్ప నెవరికిసాధ్యమా॥

### అనుపల్లవి.

సోమశేఖరభారతీశులు । సురలమునులును నేర్తురే॥ శ్రీమ ॥

### చరణములు.

భక్తిదీనింబఠించువారికి । భవబంధంబులుపాయును । భక్తి క్రీతుండురాముండెపుడెడ । బాయకుండునువీరిని । భుక్తిముక్తులుకరము గరస్థం । బులుగనుండునువీరికి । భక్తామృతమగు దీని నెల్లని । బాలిశులనేమనందగు ॥ శ్రీమ ॥ హరికి వైకుంఠమున శ్రీ నీ । నాధివుడువినిపించును । కరముమార్కండేయమునిచే । కమలజుండువినుచుండును । హరుండువినంగై లాసనగమున । నలనందీశుండుచదువును । పరగశతకోటిప్రవిస్తర । ప్రబంధమై యటవెలయును ॥ శ్రీమ ॥ దీనసగముగధృవునిసన్నిధి । దేవతలుపఠియింతురు । దీనినేయర్కునికిజెపుదురు । దివ్యముగవసిష్ఠాదులు । మానుగాగోలోకమునరా । మాయణముదశకోటియా । దీనింగల్పవృక్షాదులకునధి । దేవతలుపఠియింతురు ॥ శ్రీమ ॥ శతమఖునిలోకమునంగోటివి । స్తరమహారామాయణమును । అతిముదంబునవాలఖిల్యా । ద్యసఘుల్ పఠనముచేతురు । పతతమునునారదుండుకోటివి । స్తరగ్రంథంబుగ జదువును । అతిశుతూహలుండగుచుగంధర్వ । యతుకిన్నరాదులకొక ॥ శ్రీమ ॥ నరలోకంబునకరయనిరువది । నాల్గువేలశ్లోకములుగా । బరగవాల్మీకాఖ్యసన్ముని । పఠియించునుదీనిని । అరుదుగాసజ్జనులుపాఠా । యణముచేతురునిత్యము । కరముసాకేతకుస త్కథ । నెతింగిస్తుతియింపనేర్తునే ॥ శ్రీమ ॥ శ్రీ॥

ముఖారిరాగము - ఆదితాళము.

పల్లవి.

భగవద్గీతమహాత్మ్యమువినుఁడీ । భగవంతునిమదిఁగనుఁడీ ।
నిగమవేద్యుశాసనమునమనుఁడీ ॥ నిత్యపదవిఁగైకొనుఁడీ ॥

చరణములు.

భగవద్గీతమహాత్వమునెఱిఁగి । పొగడనేర్తురేనరులు । భగవంతునికినసాధ్యంబగునిది । పరులకెట్లుతరమగును ॥ భగ ॥ సకలోపనిషద్గోవులచెంతవి । జయువత్సంబుగనిలిపి । అకలంకంబగుగీతాదుగ్ధము । వలగోపాలుఁడుపితికెఁ ॥ భగ ॥ పితికినదుగ్ధంబునుసాధువులకుఁ । బేర్మినొసఁగెఁగృష్ణుండు । సతతమదీనియర్థంబునుమననము । సాధుజనులుచేసెదరు ॥ భగ ॥ నారాయణునిస్వరూపరూపగుణ । పారాయణమగుదీనిఁ । సారాసారవివేకులుగైకొని । సంతసమునజదువుదురు ॥ భగ ॥ ఆదినిహరియర్కునికుపదేశించె । నతడుమనువుకునుజెప్పెఁ । మోదముతోవైవస్వతుఁడిక్ష్వాకు । మేదినీశునకుఁజెప్పెఁ ॥ భగ ॥ ఇట్లురాజఋషులుమహిఁజెందిన । యీయద్భుతయోగంబు । ఎట్లోనష్టంబయ్యెనుగాలం । బెంతయుఁజెల్లెనుగావఁ ॥ భగ ॥ పరమకృపునశ్రీపార్థసారధి । పురలసీఘనయోగంబుఁ । నరునివ్యాజకరించిమొసఁగెను । సురవరులుల్లసింపఁ ॥ భగ ॥ దీనఁగలమహాదర్థమువేరెం । దైననుగలదేధరను । మానుగసకలార్థస్థలోకమిది । కానదీనిజదువుండు ॥ భగ ॥ శ్రీకరముగమాహాత్మ్యముకదం । జెలుగదీనిఁబఠింపఁ । సాలోక్యాదులకవారినిత్యముఁ । బదువదగుముముక్షువులు ॥ భగ ॥ ౪౨॥

ఆనందభైరవి రాగము - రూపకతాళము.

పల్లవి.

ధరణినేకాదశిమహాత్మ్యము। నెంతేఁగిపొగడఁ।
దరమెయెంతవారికైనను ॥

అనుపల్లవి.

కరమునిస్సమాభ్యధికమై। వరల్లువతరాజమనజగతి।
హరివాసరగౌరవముఁబొగడ। హరిహరాజులకుఁదరంబె॥ ధరణి॥

చరణములు.

ఇద్దినముననుపవసించిన। దురితతతులు। తద్దయునుదొలంగి
పోవును। హద్దుమీఱిమదుఁసఁవగదు। హరిదినమునసేరికైన।
తద్దయునుసమస్తదురిత। తతులన్నంబునందెయుండు॥ ధరణి॥
సకలఫలములబ్బుదీనను। ఈవ్రతంబు। నకునుధరణిలోనసాధ్య
ము। ఒకటియైనలేదునిజముఁ। బ్రకటనంబుచేసినాను। ఓర్పు
కలిగిసాధుజనము। లొప్పుగాఁగైకొనుఁడుదీని॥ ధరణి॥ సుర
లుమునులుఁబితృగణంబులు। ఎంతోభక్తి। హరిదినముననుపవ
సింతురు। సురనుగ్రోలఁజనుమాంసంబు। ధరణిఁగుడువఁదల్లిఁ
గవయ। వరములగునన్నంబునుహరి। వ్రతదినమునఁదినుటకం
టె॥ ధరణి॥ క్షీరజలధిఁజిలికియమృతము। నద్భుతముగ।
శేషేలుకొన్నదినమున। భూరికరుణనెల్లరకును। బురుషోత్తముఁ
డుచాటిచెప్పె। గౌరవమునసేకాదశిని। కరముసుపవసింపుఁడ
నుచు॥ ధరణి॥ ధరనుపవసింపలేనిబా। లురుసువృద్ధా। తురు
లుక్షీరజలఫలంబుల। కరముస్వీకరింపదగును। నరయసెనిమి
దేండ్లుమొదలు। వరగనెనుబదేండ్లవయసు। పుణ్యశుభగుణము
భక్తికలిగి॥ ధరణి॥ సాకేతేశుఁడైనరాముని। శ్రీకేశు। సత్కృ
పాపాత్రులసుచును। శ్రీకరముగహరిదినముఁ। జెలఁగనుణ

వసించివేగ । వైకుంఠంబునూరగానుండు । వానిదేవుభక్తిఁ గాల్చి ॥ ధరణి ॥ ౪౯॥

హిందుస్థాని కాపిరాగము - ఆదితాళము.

పల్లవి.

కౌసల్యాసుప్రజశ్రీరామా ॥

అనుపల్లవి.

భాసురసద్గుణనీరధిసోమా । భవనుతతారకనామా ॥కౌసల్యా॥

చరణములు.

మైథిలినాయకసజ్జనమిత్రా । మారసుందరసద్గాత్రా ॥ కౌసల్యా ॥ శరణాగతవత్సలదాశరథే । శార్ఙ్గధనుర్ధరదేవా ॥ కౌసల్యా ॥ మారుతివందితశ్రీపదపద్మా। ధారుణిభవభీరువుఁగరుణింపు॥ కౌసల్యా ॥ గుహాపఘనతునికినభయమొసంగుము । కూర్మిని సాకేతాఖ్యపురీశా ॥ కౌసల్యా ॥ ౫౦॥

ధన్యాశి రాగము - చాపుతాళము.

పల్లవి.

విషయవీధిఁజనువారు । మన । విశ్వేశుఁగనలేరు ॥

అనుపల్లవి.

పంపుమ్మనాడిఁజని । మారులుసదాకను ।
విష్ణుపరమపద । మిష్టపదశక్రూర ॥ విషయ॥

చరణములు.

భగవత్కథలనువినక । అతి । పాపులచరితమువినుచు । విగమవేద్యసద్గుణములఁగొనక । నెప్పు లేకగానంబునఁగొనక॥ విషయ॥ కాయముపాలికర్పించి । ధరఁ । గాలముపార్థపరుపక॥

హేయవనితమలమూత్రాలయమున । కెంతయుఁజొక్కుచుఁ
గాలముగడుపుచు ॥ విషయ ॥ కన్నులనరహరిఁగనక । సదా ।
కదుకుట్టిలవేషముల । మన్ననఁగనియానందముఁజెందుచు । మ
హిఁగాలముప్యర్థంబుగఁగడుపుచు ॥ విషయ ॥ నాలుకరామునిఁ
బొగడి । అతి । నయగుణశాలులఁగూడి ॥ కాలముఁగడుపకనప
ల్కీర్తనముచేఁ । గడుఁగష్టాత్ములైయాయువుఁగడుపుచు ॥ వి
షయ ॥ శ్రీహరిపాదతులసిని । ముక్కునఁ । జేర్చియఘములుగాక ।
ఆహాయితరవాసనలనుజొక్కుచు । యమునికినతిథులై కాలముఁ
గడుపుచు ॥ విషయ ॥ మహిసాకేతపురమునఁ । బుట్టి । మన్నన
నాత్మలకొలకు । సహింపరానికష్టంబులకోర్చి । సద్గతినెల్లరఁజే
ర్చుటఁదలఁపక ॥ విషయ ॥ ౭౩॥

జంఝూటిరాగము - రూపకతాళము.

పల్లవి.

రామరవికులాబ్ధిసోమరాఘువరామ ॥

అనుపల్లవి.

స్వామినన్ననన్యగతికు । సాధుగోష్ఠిఁజేర్పవేగ ॥ రామ ॥

చరణములు.

నిన్నువిడిచియొరులవేడ । నేరనికమయ్యదేవ । నన్నుపేకుఁ
చేయఁదగునె । నలినజార్చితాంఘ్రిపద్మ ॥ రామ ॥ అలసముద్ర
తీరమందు । హరిసమూహమధ్యమందు । అలవిభీషణునికొసఁ
గిన । యభయమిచ్చినన్నుఁబ్రోవు ॥ రామ ॥ కాకాసురునిగాచి
నావు । కరముమాతృద్రోహియనక । నాకునతునికభయమొసఁగ ।
నీకుపద్దమిదియొయొబుగ ॥ రామ ॥ ఇలనుజాతకంబునిష్ఠ । నెల
విడైకొనినవన్ను । అలకపోలనిమ్మఁజాలై । యరసిప్రోవుసాకే
తేశ ॥ రామ ॥ ౭౪॥

నాధనామక్రియరాగము - ఆదితాళము.

చ ర ణ ము లు.

మంజులముగమితభాషిణియై తిన్నగ । మాటలాడుమంచియా
డది । లంజవడుచువలెఘట్టిగనరచుచు । లజ్జవిడిచియుండుచె
డ్డది ॥ భర్తదైవమనిభక్తిచేయుచును । పతివ్రతయైయుండు
నాడది । భర్తనత్తమామలనలక్ష్యముచేసి । పాపియైమెలఁగు
చుచెడ్డది ॥ ఖలులపొందుఁగోరకమంచినడువడి । కలిగిమెలఁగు
మంచియాడది । కలకాలంబునుగలహప్రియయై । కాలముఁగ
డపుచుచెడ్డది ॥ ఇల్లువెడలకగృహకృత్యంబుల । నింపుగఁజేయు
మంచియాడది । కల్లలాడుచునుపకపకనవ్వుచు । నిల్లువెడలు
దుష్టచెడ్డది ॥ బాగుగవేకువఁగ్రుంకిధౌతాం । బరముధరించుమం
చియాడది । వేగమెగ్రుంకకమలినాంబరముతో । విహరించును
చెడ్డచెడ్డది ॥ ముఖమునఁజంద్రముదాల్చిలక్ష్మివలె । ముదమందు
నుమంచియాడది । ముఖముశూన్యముగభయభక్తులులేక ।
మొద్దువలెనుండుచెడ్డది ॥ కల్పవృక్షమువలెనతిథులను । గడుఁ
బూజించుమంచియాడది । అల్పబుద్ధియైభర్తనుదిట్టుచు । నతి
థులఁదోలునుచెడ్డది ॥ నిద్రాహారములతిస్వల్పములై । నేర్పున
వర్తించునాడది । నిద్రాహారములధికంబైకడు । నిందఁగాంచు
చెడ్డచెడ్డది ॥ పనులయెడనేమరకసుగష్టముఁ । బాటించుమంచి
యాడది । పనులఁజేయకపరిహాసోక్తుల । భాషించుచునుండు
చెడ్డది ॥ పుట్టింటికిఁబలుమారునుబోవక । మెట్టింటనెయుండునా
డది । పుట్టింటనెయెప్పుడునుమెలంగుచు । మెట్టినడునుచెడ్డచె
డ్డది ॥ తెల్లవారకమునుమేల్కొను । దేటమనసుతోనాడది । కల్ల
నిద్రనటించుచుఁబవళించు । గరమునిదురవదుచెడ్డది ॥ భగవ
ద్భక్తితోవారికథవినుచును । బరగుచుండుమంచియాడది । మిగు
లాలస్యాళియైనాకేలేకుని । మదినిఁగొల్లాదుచెడ్డది ॥ ౪౭॥

శ్రీరాగము - అటతాళము.

పల్లవి.

మందరధర శ్రీభూనీళేశ్వర । మన్ననసేతుఁ బ్రోవుమా ॥

అనుపల్లవి.

కందర్పజనక శ్రీ కాకుత్స్థాన్వయ । కలశాంబుధిసోమ శ్రీ తారక నామ ॥ మంద॥

చరణములు.

పదివేషములఁ బూని సాధులరక్షించి । పాపుల శిక్షించి । సదయుఁడై ధర్మసంస్థాపన మొనరించి । శరణాగతుని పేక్షచేయుట ధర్మమె ॥ మంద ॥ జలధిగట్టున నుభయ సేనలమధ్యనే । శ్రవణార్జునులఁ గూర్చి । ఎలమి నభయమిచ్చి శరణాగతుని నన్ను । ఇలను పేక్షించిన నగు బాటగునుసేకు ॥ మంద ॥ శరణాగతత్రాణబిరుదు వహించిన । సాకేతపురి నాయకా ॥ ధరణిసనన్యార్హ శేషత్వయుం త్తుని । తడయక భవభీరువగు నన్నుఁ గైకొమ్ము ॥ మంద॥ రతా॥

కమాసు రాగము - ఆదితాళము.

పల్లవి.

శ్రీరఘుపతి శశినిభవదనా । పవనసుతవినుత । శ్రీరఘుపతి శశినిభవదనా ॥

అనుపల్లవి.

పారరహితభవఘోరజలధిఁ దాట । నీరజాక్షభక్తి నావను సంగొనము ॥ శ్రీరఘు॥

చరణములు.

వనితల నేత్రములను వలలోఁ బడి । యనవరతము నిను భజనము చేయక । ఘనతరు వనగములనాశ్రయించి మహి । దినములగ

దుష్టగష్టులఁ జేరవెరతు ॥ శ్రీర ॥ పరదూషణసతతంబును జేయు
చుఁ । బరవనితలపొందెంతయుఁ గోరుచు । పరవిత్తంబులనపహ
రించుచును । గరముమిలఁగుగష్టులఁ గూడవెరతును ॥ శ్రీర ॥
మనసునీకర్పణమొనరించి । యనయమునీసద్గాథలవినుచును ।
ఘనశ్రుతిమార్గంబునఁజరియించెదు । ఘనసజ్జనగోష్ఠినినస్థైర్య
ము ॥ శ్రీర ॥ సాకేతపురాధీశ్వరగుహసఖ । సౌమిత్రిసహాయా
దరబుధవందిత । శ్రీకంఠవినుతతారకనామా । చేర్పుమునారల
నీపదయుగ్మము ॥ శ్రీర ॥ ౪౯॥

## శ్రీరాగము - అటతాళము.

### పల్లవి.

సీతామనోహరసీతామనోహర । సీతామనోహరసీతాపతే ॥

### చరణములు.

భవభయభంజనదశరథనందన । శివచాపఖండనసీతాపతే ॥
సీతా ॥ తల్లియునీవెతండ్రియునీవె । తగుగురుఁడునునీవెసీతా
పతే ॥ సీతా ॥ దైవమునీవెబంధువునీవె । తగుతనయుఁడునీవె
సీతాపతే ॥ సీతా ॥ ద్రవ్యమునీవెదాతయునీవె । దివ్యగుణాం
బుధిసీతాపతే ॥ సీతా ॥ కన్నులునీవెమనసునునీవె । కన్ని
యునీవెశ్రీసీతాపతే ॥ సీతా ॥ సూర్యుఁడునీవెచంద్రుఁడునీవె ।
తారలుపొడగనుసీతాపతే ॥ సీతా ॥ భూమియునీవెజలమును
నీవె । పుణ్యులుపొగడెదుసీతాపతే ॥ సీతా ॥ వైశ్వానరుఁడు
నీవెయాకాశమునునీవె । వాయువునీవెశ్రీసీతాపతే ॥ సీతా ॥
గిరులునునీవెభూరుహములునీవెసా । గరములునీవెశ్రీసీతాపతే ॥
సీతా ॥ అందునునీవెయిందునునీవె । రెండునునీవెశ్రీసీతాపతే ॥
సీతా ॥ ముందునునీవెవెనుకనునీవెనా । యందునునీవెశ్రీసీతా
పతే ॥ సీతా ॥ ముల్లోకములునీవెమూర్తులునునీవె । ము

గ్గుణంబులునీవెసీతాపతే ॥ సీతా ॥ యజ్ఞకర్తయునీవెయజ్ఞభోక్తయునీవె । యజ్ఞమూర్తియునీవెసీతాపతే ॥ సీతా ॥ నవనిధులునునీవెనవగ్రహంబులునీవె । నలినజార్చితపాదసీతాపతే ॥ సీతా ॥ వేదంబులునునీవెవేదాంతములునీవె । వేదాంతవేద్యశ్రీసీతాపతే ॥ సీతా ॥ శాస్త్రంబులునుసీవెశాస్త్రవేత్తయునీవె । శాస్త్రప్రదాతశ్రీసీతాపతే ॥ సీతా ॥ యోగంబునునీవెయోగనిష్ఠుడునీవె । యోగేశ్వరైనశ్రీసీతాపతే ॥ సీతా ॥ మంత్రంబునునీవెమంత్రార్థమునునీవె । మంత్రప్రదాతశ్రీసీతాపతే ॥ సీతా॥ పురుషుండునుసివెస్త్రీయునునీవెన । పుంసకుండునునీవెసీతాపతే ॥ సీతా ॥ దేవతిర్యఙ్మనుజస్థావరములు । భావింపనీవెశ్రీసీతాపతే ॥ సీతా ॥ ఏమనివర్ణింతునందరునన్నియు । నీమూర్తులైయుండుసీతాపతే ॥ సీతా ॥ నాకడనేయుండునన్నేమరకుండు । నీకుభృత్యుండనుసీతాపతే ॥ సీతా ॥ ఇంద్రియచోరులున్జ్ఞానరత్నముంగొన । సందువెదకెదరుసీతాపతే ॥ సీతా ॥ దుర్బలునన్నుంజేపట్టిపోషింపుమా । యబ్బనీవేకాదెసీతాపతే ॥ సీతా ॥ శ్రీకంఠార్చితపాదపద్మమత్ప్రాణేశ । సాకేతనిలయశ్రీసీతాపతే ॥ సీతా ॥ ౫౦॥

శ్రీరాగము - ఆదితాళము.

పల్లవి.

నన్నేలుముశ్రీపండరినాథా । నమోనమోశ్రీరుక్మిణీనాథా ॥

అనుపల్లవి.

నిన్నేనమ్మితినీరజనాభా । నన్నేమరకరక్షింపుముదేవా ॥

చరణములు.

పుండరీకవత్సులుండగుస్వామీ । భూరిదయాసాగరమన్నాథా । అండజవాహనవందితపాదా । ఆదిత్యకోటిశాంకాశాశ్రీశా ॥

నన్నేలు ॥ మానవజన్మముదుర్లభమబ్బుట । జ్ఞానవంతుఁడగుట
తెదుస్తరము । ఈనరజన్మంబుననినుగొల్వక । నింద్రియవశ్యతఁ
జెడఁదగదక్కట ॥ నన్నేలు ॥ నీదుకృపాలబ్ధంబగుజ్ఞానము ।
మీదనెకన్నిడియరిషడ్వర్గము । మదినినన్నేమరచికైకొనఁగ ।
మెలగుచునున్నదికూల్పుముదానిని ॥ నన్నేలు ॥ తనురథమును
నింద్రియదుష్టాశ్వముల్ । తద్దయునీడ్చెడివిషయవీధికిని । ననుసు
షుమ్నవాడినినడిపించి । నినునెప్పుడుఁగనుఁగొనఁగరుణింపుము॥
నన్నేలు ॥ మునుసాకేతపురంబునఁబుట్టి । మునులసురలనెంత
యురక్షించి । తనివిలేకసర్వాప్తులసీతోఁ । గొనిపోయినరీతిని
నన్నేలుము ॥ నన్నేలు ॥ ౫౧॥

పున్నాగవరాళిరాగము - రూపకతాళము.

ప ల్ల వి.

భక్తినావనెక్కరండు । భక్తులారా । ముక్తిసీమఁజేరుటకు ॥

చ ర ణ ము లు.

ఆపదయెనీరైయవంగ । వాయువుచే । ననవరతంబునుబెరుగు ।
భాసురమోహోర్మితతుల్ । భక్తులార । భార్యసుతభ్రాతృ
సుతుల్ । ఈసునసముగ్రాహములై కబళింపఁబూను । నిట్టిసంసా
ర్ణవమున్నులగుమనకు । వాసుదేవునిపాదసీమఁజేరుటకు । వను
ధనొండొకయుపాయములేదుకాన । శ్రీసతీకాంఘ్రిమీయాత్మ
భారంబుఁ । జెలగనర్పించిశ్రీభక్తవత్సలుని । దాసదాసులరగు
చునీషణత్రయము । గోసివేసియసంగశస్త్రమునవేగ ॥ భక్తి
నావ ॥ నావనుమాటిగనడుపు । శఠవైరి । నావికుఁడుచతురత
తో । శ్రీవిష్ణుచిత్తాదు । లైవతన । చెలికాండ్రతోఁగూడి । శ్రీ
శైలయనాథయామునయతీంద్రులును । శ్రీవరయతీంద్రనిగమాం
తముఖగురుల । నావనెక్కించుకొనిముక్తిసీమకును । తేవేగన

డి పెడిని హెచ్చరిక తోడ । భావజనివలం... పురులవనితలకుఁ । బరధనంబులకాసపడిపతితులగుచు । శ్రీవిభు... దేవధర్మంబులను మరచి । చెడక వైరాగ్యసుజ్ఞానయుతులగుచు ॥ భక్తి ॥ శ్రీరం గంబిందుభవ । రోగహారం । బారమౌష్యధముందు । వారణ శైలంబిందు । తాపహర । వరదాఖ్యలతయుంను । శ్రీరమ్యమ గు వేంకటాద్రిఁజూడుండు । శ్రీలతాపరివేష్టితంబైనకల్ప । భూ రుహంబదెతన్నుఁజేరువారలకు । భుక్తిముక్తిఫలంబులిచ్చుఁగ నుఁగొండు । అరయఁగనజ్ఞానతిమిరంబుఁబాపు । యదుశైలనీ పంబునదుగొచూడుండు । తీరుగానీషణత్రయవనాగ్నియగు । దివ్యస్థలములనూటయెనిమిదిని సేవించి ॥ భక్తి ॥ సాకేతపుర ముందుఁ । వారకాఖ్య । సన్మంత్రదేవతను । శ్రీకంతాదులుకొ ల్తు । రట్టిమన । సీతేశుదర్శించి । శ్రీకరంబుగనతనికృపకుఁబా త్రులమై । చేరిద్వారకనుగోవిందుదర్శించి । భీకరభవాహివిష భేషజమై వెలయు । లోకనన్నుతభగవద్గీతమూలికఁజెంది । భూ కాంతభూషణమైవిబుధసేవ్యంబై । భుక్తిముక్తిదమైనసిద్ధాశ్ర మమున । లోకగతుకుఁదైనవామనావిత్యు । శ్రీకరుణనజ్ఞానతి మిరమునుబాసి ॥ భక్తి ॥ ౫౨

హిందుస్థానికాపిరాగము - ఆదితాళము.

పల్లవి.

ఎవరినికొలుదునిందరిలోపల । నేమనియూరడియుందును దేవా ॥

అనుపల్లవి.

భువినిక్షేత్రకృపనన్నేలుము । పురుషోత్తమభవభీరుఁ శ్రోత్రము ॥ ఎవరి ॥

చరణములు.

కర్మయోగమునని మఁగొల్చితినా । ఘనవిజ్ఞానాంబుధినై యెంతయు । నిర్మలుఁడగుజనకాధీశునివలె । నీరజాసనశ్రితప దపద్మా ॥ ఎవరి ॥ జ్ఞానయోగనిష్ఠుఁడనై తినేయ । జ్ఞానమాలిన్యము నెడఁబాసి । మానుగభరతయోగీంద్రునికైవడి । మాధవమధుసూదనగోవిందా ॥ ఎవరి ॥ భక్తవత్సలప్రహ్లాదునిమాడ్కని । భవబంధంబులనెంతయుఁబాసి । భక్తియోగనిష్ఠుఁడనైతినే । భారతీశభవముఖసురరక్షక ॥ ఎవరి ॥ గజనాథునివలె నాదిమూలమని । కడునమ్ముఁడనై యన్యముమెల్లక । నిజమగు భక్తినినినుబిల్చితినే । నిర్జరమునిగణవందితపాదా ॥ ఎవరి ॥ శబరికైవడినీకుఫలంబుల । సద్భక్తిని నేనర్పించితినే । అబలుఁడనింద్రియవశ్యుఁడదీనుఁడ । నాంజనేయపరిచితపాదాబ్జా ॥ ఎవరి ॥ శృంగిబేరపురిగుహునిచందమున । మంగళముగనీసన్నిధిఁగాంచి । సంగతినీమన్ననఁగైకొంటినె । సనకసనందనముఖమునివినుత ॥ ఎవరి ॥ ఎంతయునంజననందనువలెనే । నింద్రియశత్రువులనుమర్దించి । అంతరంగుఁడై నీకృపకెంతయు । నర్గంబైతినెమారినారాయణ ॥ ఎవరి ॥ ధృవునివలెనద్భుతతపమెంతయు । దృఢమతియుతుఁడనై భువినొనరించి । ధృఢమగునీసత్కృపఁజెందితినే । భవభయహరణాజానకీరమణా ॥ ఎవరి ॥ ఇలద్రౌపదివలెశరణాగతుఁడ । న్నెలుముగోవిందాయనియంటినె । అలకుచేలునివలె నీకడుకుల । నర్పించితినాసాకేతేశ్వర ॥ ఎవరి ॥ ౫౩॥

జెంఝూటిరాగము - ఆదితాళము.

పల్లవి.

దశరథనందనదశశిరమర్దన । దయఁజూడుముననుదైత్యారీ ॥

అనుపల్లవి.

దశవిధవేషంబులనుధరించి । దానులవరసిరక్షించినరాఘవా ॥

చరణములు.

నేనీదాసుఁడననిశరణాగతి । నిర్మలాంతఃకరణుఁడై చేసిన । వానికెనసఁగుదుసర్వభూతముల । వలననుభయంబనితగఁబల్కిన ॥ దశరథ ॥ అర్ధాంగినిమైథిలినెడబాసివే । యబ్జములోర్చిసహోదరులక్ష్మణు । నర్ధనిమిషమెడబాసిబ్రతుకనని । యనినభక్తవాత్సల్యంబెట్టిదో ॥ దశరథ ॥ రావణుండుజీవింపఁగలంకా । రాజ్యమునువిభీషణునికొసంగి । నీవాశ్రితులనుజీవన్ముక్తుల । నేర్పఁజేయుటవ్యక్తముచేసిన ॥ దశరథ ॥ సఖులలోనవగ్రేసరుఁడితఁడని । సత్కృపగుహుపురిసన్నిధిచేసి । యఖిలాత్మలునద్భుతమందదఁగన । య్యనఘునిబహుమానించినదేవర ॥ దశరద ॥ మునులోకాధీశుండై యిప్పుడు । ముదమునసుగ్రీవుఁరాజుగఁగోరి । యనయముశేషత్వంబునఁగలరుచి । ననుభవింపఁగోరితివౌరౌర ॥ దశరథ ॥ భక్తినిశబరియర్పించినఫలముల । బహుమానించిభుజించుటచేసీ । భక్తవత్సలత్వంబునునెంతయుఁ । బ్రకటించినశ్రీసాకేతేశ్వర ॥ దశరథ ॥ ౫౪॥

హిందుస్థానికాపిరాగము - ఆదితాళము.

పల్లవి.

రామారామాశుభగుణస్తోమా । రవికులసోమావైకుంఠధామా ॥

అనుపల్లవి.

కామారిస్తుతతారకనామా । కమనీయశ్రీతులసీదామా ॥

చరణములు.

నాకభయంబునెసంగుమురామా । నాకేశార్పితపుష్కరదామా ॥ రామా ॥ పాలింపుముననుపట్టాభిరామా । పతితపావన

జితభార్గవరామా ॥ రామా ॥ అఖిలజగంబులఁబ్రోచెడుస్వా
మీ । మఖరరక్షకననుమఱచితివేమీ ॥ రామా ॥ నతునుపే
క్షించినలోకమునగును । క్షితినీకీర్తికిమాలిన్యమగును ॥ రామా ॥
ననునింద్రియములుబాధింపఁదగునా । ననుమఱచుటనీకున్యాయం
బగునా ॥ రామా ॥ జ్ఞానకరంబుచేననునుద్ధరింపుము । స్వామీ
శరణాగతురక్షింపుము ॥ రామా ॥ శరణంటినిశ్రీపార్థసారథే ।
సత్కృపఁబ్రోవుముకరుణానీరధే ॥ రామా ॥ సజ్జనప్రియనను
గావఁగరమ్మా । సాకేతేశ్వరయభయంబిమ్మా ॥ రామా ॥ ౫౫॥

జెంఝూటిరాగము - ఆదితాళము.

పల్లవి.

కావవయ్యశ్రీకంజలోచనా । కరుణజూడుముభవవిమోచనా ॥

అనుపల్లవి.

దేవనన్నుపేక్షింపఁబాడియే । దీనరక్షకాదైత్యశిక్షకా ॥

చరణములు.

నిన్నునేనుగీర్తనముచేయక । నీరజాసనార్చితపదాంబుజ ।
ఎన్నిజన్మములెత్తినానుశ్రీ । యిందిరేశనన్నిపుడైకొమ్ము ॥
కావ ॥ లెక్కలేనిపాపములఁజేసితి । నక్కటామతిహీనుఁడై
తిని । చక్కగానినుస్తుతియొనర్చద । స్వామినీవునన్నేలుఁజే
యుము ॥ కావ ॥ నిన్నుఁగొల్వకఁబరులఁగొల్చితి । నేర్పులేక
యోపక్షివాహనా । నన్నునీవుసత్కృపనుజూచుట । నిన్నెగా
కనేనొరులఁగొల్వను ॥ కావ ॥ పరులవేడినేఁబాపినైతిని । పాప
భీరుడైనిన్నుఁజేరితి । నరకమందునన్నఁబలుఁద్రోయక । నాథనీ
కృపాకలితుఁజేయుము ॥ కావ ॥ నాకుఁదాతవనిష్ఠనానఁటి । నలి
నపాదసద్భృత్యుఁజేయుము । సాకేతేశనీవలెబ్రోవుము । దాద్ను
నన్నుఁ[illegible]త్రము ॥ కావ ॥ [illegible] ౫౬॥

మోహనరాగము - రూపకతాళము.

పల్లవి.

భుక్తిప్రదశక్తిప్రద । యుక్తిప్రదరామా । భక్తిప్రదరక్తిప్రద । ముక్తిప్రదనామా ॥

చరణములు.

నీవేనాకులదైవము । నిక్కంబుగరామా । శ్రీవత్సాంకితవత్సా । శ్రీతులసీదామా ॥ భుక్తి ॥ సంసారాంబుధిదాటఁగ । సత్సంగతినావ । కంసాంతకవానినొసఁగి । కరుణింపుముదేవ ॥ భుక్తి ॥ అరయఁగభగవద్భాగవ । తాపచారంబులను । కరమునొనర్చినసీచున । న్గరుణింపుమియిలను ॥ భుక్తి ॥ నీవుపేక్షించిన నన్నికఁ । గావఁగదిక్కెవరు । శ్రీవనితాధీశ్వరయా । శ్రితరక్షకులెవరు ॥ భుక్తి ॥ రక్షింపుముశరణాగతు । రయమునసీతేశా । శిక్షింపుమరులనార్యర । శ్రీసాకేతేశా ॥ భుక్తి ॥ ౫౭॥

కమాసురాగము - అటతాళము.

పల్లవి.

అనయమునను బ్రోవు । మవనీసుతాపతి ॥

అనుపల్లవి.

వినుమదినమ్మితి । నిరజాన్వయమణి ॥ అన ॥

చరణములు.

తాళముఁగాచిన । కరుణాసుధాంబుధి । పాకశాసనవంద్య । భవభీరువుఁబ్రోవుము ॥ అన ॥ అలవిభీషణులంక । కధిపతిఁజేసిన । జలనిధిగంభీర । శరణాగతునిఁబ్రోవు ॥ అన ॥ తాళినాతిఁగఁజేసి । సీతను చేపట్టి । నీతినతులఁగాచు । సర్వేశనన్నుబ్రోవు ॥ అన ॥

సాకేతపురనాధ । సాధుజనప్రియ । శ్రీకరముగనన్నుఁ । జేబట్టి ప్రోవుము ॥ అన ॥ ౫౮॥

పూరికల్యాణిరాగము - అటతాళము.

పల్లవి.

రక్షించురక్షించురామా ॥

అనుపల్లవి.

రాక్షసభీకర । రవికులసోమా ॥ రక్షించు॥

చరణములు.

శరణాగతత్రాణ । బిరుదువహించిన । కరుణాసుధాంబుధి । కంజజజనకా ॥ రక్షించు ॥ కౌశికుయాగముఁ । గడుప్రీతిఁగాఁచిన । దాశరధేనాకు । దయనభయంబిమ్ము ॥ రక్షించు ॥ మూరుతినేలిన । మారజనకరామా । భూరిదయాంబుధి । పురుషోత్తమాపాహి ॥ రక్షించు ॥ సాకేతపురవాస । శార్ఙ్గధనుర్ధర । నాకేశవినుతశ్రీ । నారాయణహరి ॥ రక్షించు ॥ ౫౯॥

కాంభోజిరాగము - ఆదితాళము.

పల్లవి.

రఘునాయకనీవరసితావకున్న । రక్షకులెవరయ్యా ॥

అనుపల్లవి.

అఘరహితుండగుగుహునిసఖుండని । యాదరించినట్లరసిన న్నేలుము ॥ రఘు ॥

చరణములు.

తల్లిగతియనినమ్మఁగడగునే । ధర్మాత్మకేయుచరిత్రమువిధమె । ఉల్లములనభంప్రణివిగతియనినే । మారడుదెల్లుహిరణ్యునికధవిని ॥

రఘు ॥ అన్నగతియనివమ్మంగఁదగునే । అవనిని వాలిచరిత్రము వినలేదే । పన్నగగంసునినడువడి యెఱింగియుఁ । బరగసుతుఁడు రక్షకుఁడననెట్లగు ॥ రఘు ॥ చుట్టములిలరక్షకులెట్లగురు । చోరులువీరనిబుధులువచింపరె । ముట్టిధనంబునుసర్వముఁగొందురు। మోమునుజూపరుదారిద్ర్యంబున ॥ రఘు ॥ దేవతలనురక్షకుల నఁదగునే । రావణాంతకుఁడురక్షించువారల । ఈవసుధనుదిక్కగునేద్రవ్యం । బెంతయుసర్వానర్థమూలంబది ॥ రఘు ॥ పాకశాసనాదులఁగాచుటకై । పరగదశరథునికూర్మిసుతుండై సాకేతపురంబున నెలకొనినత । జనులఁగాచినశ్రీసీతాపతే ॥

ముఖారిరాగము - ఆదితాళము.

పల్లవి.

రామనామౌషధముఁగ్రోలుఁడు । భవరోగహరమౌ । రామనామౌషధముఁగ్రోలుఁడు ॥

అనుపల్లవి.

కామకుటిలవాయువుచేఁ । గరముపిషయరజముకప్పి । శ్రీమదాంధులైనవారికి । మలినమునుబాపు । రామనామౌషధముఁగ్రోలుఁడు । ఇదివొడ్డమందు ॥ రా ॥

చరణములు.

పరులధనమునపహరించి । పరవనితలపొందుచేసి । పరదూషణము చేయరోగము । ప్రబలముగఁగలిగె । రామనామౌషధముఁగ్రోలుఁడు ॥ ఇదిదొడ్డమందు । రామనామౌషధము ॥ భగవదారాధనముమాని । నిగమవేద్యుస్తుతినిమాని । జగతినవముఁజేయరోగము । ప్రబలముగఁగలిగె । రామనామౌషధముఁగ్రోలుఁడు । ఇదిదొడ్డమందు । రామనామౌషధముఁగ్రో

లుఁడు ॥ కామక్రోధాద్యరిషడ్వర్గ । మేమరించిచొక్కిపోడిని ।
మీమీదనుజల్లరోగము । ప్రబలముగఁగలిగె । రామనామౌష
ధముఁగ్రోలుఁడు ॥ ఇదిదొడ్డమందు । రామనామౌషధముఁగ్రో
లుఁడు ॥ హరిదినమునఁగుడుచుటను । హరిభక్తులనుదూషించు
టను । హరికథలనువినమిరోగము । ప్రబలముగఁగలిగె । రామ
నామౌషధముఁగ్రోలుఁడు । ఇదివొడ్డమందు । రామనామౌష
ధముఁగ్రోలుఁడు ॥ శంకరవాల్మీకివాయు । జముఖభిషగీశ్వరు
లీమందు । సంకటంబుతీరనిత్తురు । జాగుచేయకను । రామనా
మౌషధముఁగ్రోలుఁడు । ఇదివొడ్డమందు । రామనామౌషధ
ముఁగ్రోలుఁడు ॥ జగతిలో వెలలేనిమందు । జగతివెదుకదొరక
దెందు । నిగమస్తుతిఁగాంచినదీమందు । నిక్కమైనమందు ।
రామనామౌషధముఁగ్రోలుఁడు । ఇదిదొడ్డమందు । రామనా
మౌషధముఁగ్రోలుఁడు ॥ ఖలులపొందుచేయవలదు । కరముజీవ
హింసవలదు । కలకాలదిదీనులఁబ్రోవుఁడు । ఇదిపథ్యమరయు ।
రామనామౌషధముఁగ్రోలుఁడు । ఇదిదొడ్డమందు । రామనా
మౌషధముఁగ్రోలుఁడు ॥ కోపమునకుఁజోటీకుండు । పాపకృత్య
ములఁజేయకుఁడు । శ్రీపతినిమరువకుండుఁడు । ఇదిపథ్యమరయు ।
రామనామౌషధముఁగ్రోలుఁడు । ఇదిదొడ్డమందు । రామనా
మౌషధముఁగ్రోలుఁడు ॥ పరులనెవ్వనాడకుండు । పరులనవ
మానింపకుండు । కరమశాంతిఁగైకొనుండు । ఇదిపథ్యమరయు ।
రామనామౌషధముఁగ్రోలుఁడు । ఇదిదొడ్డమందు । రామనా
మౌషధముఁగ్రోలుఁడు ॥ సాకేతేశుదివ్యకరుణా । జలధివారో
గ్యస్నానంబు । శ్రీకరముగఁజేసియనఘులై । జాగ్రతతోఁబొ
ందిరి । రామనామౌషధముఁగ్రోలుఁడు । ఇదిదొడ్డమందు ।
రామనామౌషధముఁగ్రోలుఁడు ॥ [illegible]

## కేదారరాగము - అటతాళసాపు.

### పల్లవి.

ప్రణవమందిరనిలయశ్రీ । పరవాసుదేవశౌరే ॥

### అనుపల్లవి.

ప్రణవవాచ్యశరణాగతుని । బాలించురంగనాథా ॥ ప్రణవ ॥

### చరణములు.

దశవిధదివ్యవేషా । శ్రీ । ధరశశిసూర్యనేత్ర । దశకంఠాది దైత్యకాల । దశరథరాజపుత్ర ॥ ప్రణవ॥ వైకుంఠదివ్యధామా। శ్రీ। వనజాక్షునిగమవేద్య । పాకశాసనాదిదేవ । పరిచితపాద పద్మా ॥ ప్రణవ ॥ ద్వారకానిలయాచ్యుతా । మం । దరధరవన్నె లుమా ॥ రారానన్నుబ్రోవవేగ । శ్రీరంగదివ్యధామా ॥ ప్రణవ ॥ సాకేతపురవిహారా । శ్రీ । జనకజాప్రాణేశ్వరా । శ్రీకంఠార్చితాంఘ్రిపద్మ । చెలఁగనాకభయమిమ్ము ॥ప్రణవ॥౽౨॥

## కల్యాణిరాగము - అటతాళము.

### పల్లవి.

నమ్ముండునమ్ముండుశ్రీరాముగతియని ।
నమ్మకఁబోయినఁజెడిపోదురు ॥

### అనుపల్లవి.

నమ్మికొల్చెడుభక్తజనములకబ్బును ।
ఇమ్మహిసుఖమునుబిమ్మటముక్తియు ॥ నమ్ముండు॥

### చరణములు.

నమ్మినసుగ్రీవుఁడుహరిగణపతియయ్యె । నమ్మకవాలియొక్కమ్ము నఁజావఁడె । నమ్మివిభీషణుండిలంకపతియయ్యె । నమ్మకరావణుఁ

దనిలోనఁగూలెను ॥ నమ్ముండు ॥ నమ్మిధృవుండుశాశ్వతగతిఁగాం
చెను । నమ్మకసురుచిదుఃఖంబునిందనుగాంచె । నమ్మిప్రహ్లాదుఁడు
పరమప్రఖ్యాతిఁగాంచె । నమ్మకహిరణ్యుడువమ్మయిపోయెను ॥
నమ్ముండు ॥ నమ్మిదేవతలునిర్జరులయినెగడిరి । నమ్మకనసురులు
నాశముఁబొందిరి । ఇమ్మహిమానవజన్మముదుర్లభ । యిమ్ముగ
సాకేతపతిభక్తిఁగొల్వుండు ॥ నమ్ముండు ॥ ౩॥

యమునాకల్యాణిరాగము - సాపుతాళము.

పల్లవి.

బ్రహ్మాదివందితపాదరామా । బ్రహ్మకుజనకుఁడైపరగురామా ।
బ్రహ్మజ్ఞులగువారిపాలిరామా । బ్రహ్మకిల్లగునాభిపద్మనామా ॥

చరణములు.

దశరథజనపతితనయరామా । కుశికజయాగరక్షక శ్రీరా
మా । దశదిక్కులనుగీర్తిఁదనరురామా । శశిముఖయహల్య
రక్షక శ్రీరామా ॥ బ్రహ్మాది ॥ జనకపురమునకుఁజనినరామా ।
చంద్రశేఖరచాపభంగరామా । జనకజసీతఁగైకొనినరామా ।
జమదగ్నిసుతగర్వభంగరామా ॥ బ్రహ్మాది ॥ జనకాజ్ఞవనముఁ
జొచ్చినశ్రీరామా । అనయముగుహునెలిమికలరురామా । ఘన
రక్కసులఁగూల్చినట్టిరామా । హనుమంతునేలినయయ్యరా
మా ॥ బ్రహ్మాది ॥ అలసుగ్రీవునిసఖుఁడైనరామా । ఇలవాలిఁ
గూల్చినయీశరామా । జలధిబంధించినస్వామిరామా । ఖలు
రావణునిగూల్చివెలయురామా ॥ బ్రహ్మాది ॥ పట్టాభిరాముఁడై
పరగురామా । చుట్టిసాధులుకొల్చుచుండురామా । నెట్టనసాకే
తనిలయరామా । పట్టిగశరణ్యుఁజేపట్టురామా ॥ బ్రహ్మాది ॥ ౫౩॥

## ఆనందభైరవిరాగము - అటతాళము.

### పల్లవి.

రామరామరమ్మురమ్ము । స్వామినాకువరమునిమ్ము ॥

### అనుపల్లవి.

కామజనకఁగరుణఁజూడుఁ । బామరునిబరగనేడు ॥ రామరామ॥

### చరణములు.

జనకుఁడీవుజానకీశ । తనయునన్నుఁదనరఁబ్రోవు ॥ రామరామ ॥ రక్షకుఁడవురమ్ముబ్రోవ । రక్ష్యమగుననురాజీవాక్ష ॥ రామరామ ॥ శేషివీవుచేరినన్ను । శేషభూతుఁజెలఁగఁబ్రోవు ॥ రామరామ ॥ భర్తవీవుభార్యనన్నుఁ । గర్తవైవేకావుమయ్య ॥ రామరామ ॥ జ్ఞేయునెఱిఁగిచేతువినుతి । తోయజాక్షదురితదూర ॥ రామరామ ॥ స్వామినీవుస్వమ్మునేను । కామజనకకరుణఁబ్రోవు ॥ రామరామ ॥ ఆధారమునీవయ్యనాకు । ఆధేయమునన్నరసిప్రోవు ॥ రామరామ ॥ నీవెయాత్మనేదేహంబు । కావుమయ్యకరుణనన్ను ॥ రామరామ ॥ భోక్తవీవుభోగ్యమేను । సూక్తులనుస్తుతియొనర్తు ॥ రామరామ ॥ పరగనవసంబంధములను । గరుణనన్నుఁగావుమయ్య ॥ రామరామ ॥ శరణాగతు శ్రీసాకేతేశ । కరిశైలేశకరుణనేలు ॥ రామరామ ॥ ౬౫॥

## ముఖారిరాగము - ఆదితాళము.

### పల్లవి.

సాధుజనములారారండు । సాకేతపురికిని ॥

### అనుపల్లవి.

శ్రీధరుఁడమరులవేఁడికోలువినను । శ్రీరాముండయ్యెగా ॥ సాధు॥

చ ర ణ ము లు.

తారకబ్రహ్మంబితఁడే । వినుఁడీ । తపస్వులతపఃఫలంబితఁడే। శ్రీరమ్యంబుగశంకరమునియే । మారనిమన్వర్థమితఁడే ॥ సాధు॥ హృదయాలయముననెపుడు । వినుఁడీ । ముదముననెలకొని నతుల।సదయుండై యనవరతముఁబ్రోచును । సద్భక్తినివేరండు॥ సాధు ॥ భక్తవత్సలుఁడితఁడే । మఱియును । భక్తప్రియుండితఁడే । భక్తిసనందాదులుజపియించెడు। పావననాముండితఁడే॥ సాధు ॥ నరపశుకీటాదులగు । సాకేత । పురవరవాసులఁదనతో । పరమముదంబునవైకుంఠమునకుఁ । బాయకఁగొని పోయెఁ ॥ సాధు ॥ ౬౭॥

హిందుస్థాని కాపిరాగము - ఆదితాళము.

ప ల్ల వి.

నీకెనయెవ్వరునీరజనయన ।
ప్రాకటముగనహిపతిమృదుశయన ॥

చ ర ణ ము లు.

దానవముఖ్యులదర్పమడంచి । మానుగసురలనుమన్నిన రామా ॥ నీకెన ॥ తారకనామముధరజపియింపఁ । కోరినఫలములుకొంగుబంగారు ॥ నీకెన ॥ భక్తినిరామజపంబునుజేయఁ । ముక్తివనితముదమునవరియించుఁ ॥ నీకెన ॥ నీనామమురుచి నేనెఱుఁగుదునే । మానుగశ్రీమదుమాపతిమెఱుఁగుఁ ॥ నీకెన ॥ సౌమిత్రియుగుహసామీరిముఖుల్ । నీమనురాజమునేర్తురుపొగడఁ ॥ నీకెన ॥ అగతినిశరణాగతునన్నేలుము । సుగుణాంబోనిధిసురమునివినుతా ॥ నీకెన ॥ అప్రమేయనాశభయమునిమ్ము। సుప్రసిద్ధముగసూర్యచంద్రాత ॥ నీకెన ॥ సాకేతశాశంకర వినుతా । నాకొసఁగుమునీనామామృతముఁ ॥ నీకెన ॥ ౬౮॥

జెంఝూటిరాగము - అటతాళము.

పల్లవి.

రామరామారామరామరామారామ । రామరామానన్ను రక్షించు ॥

అనుపల్లవి.

నామొరవినినన్ను దయనేలవదియేల । నారదసన్నుతనాస్వామీ ॥ రామ ॥

చరణములు.

కామజనకనన్ను నీవుపేక్షించినఁ । గరుణరక్షించువారెవరయ్యా । ఈమహినేఁజేసినట్టిపాపంబుల । నెన్న శేషునికైనఁదరమానె ॥ రామ ॥ పాపులలోనగ్రగణ్యుఁడననినాపైఁ । గోపగింపకుమయ్యసీతేశా । పాపరాధినిసానుతాపునుపేక్షింపఁ । జనునేనీకృపకున్యాయతకాదే ॥ రామ ॥ జలధితీరంబునవారిగోష్ఠినలవిభీ । షణునికథయమునిచ్చితివంద్రు । ఖలుశరణాగతునీవుపేక్షింపనీ । కరుణకుమాలిన్యమగునయ్యా ॥ రామా ॥ మాతృద్రోహిరికాకాసురునిరక్షించిన । మహనీయగుణగణకలశాబ్ధే । నాతండ్రినతునన్నీవరసిప్రోవకయున్న । వగుబాటుకాదెనీసత్కృపకు ॥ రామ ॥ నాకేశముఖదేవగణవంద్యచరణాబ్జ । నన్నేలుభక్తశ్రితాదేవా । సాకేతపురవాసనాధుజనప్రియ । శార్ఙ్గధనుర్ధరశ్రీరామా ॥ రామా ॥ ౨౮॥

ధన్యాశిరాగము - ఆదితాళము.

పల్లవి.

అధశ్శాఖంబై యూర్ధ్వమూలంబగు । నశ్వత్థమొక్కటిమనసా । బుధవినుతంబగుననంగశస్త్రం । బునఛేదింపుముమనసా ॥

చరణములు.

క్షరుఁడక్షరుఁడనఁబురుషులిరువురు । జగతిఁబరగుదురుమనసా । క్షరుఁడనసర్వభూతములుకూటస్థుఁడ । క్షరుఁడనియెఱుఁగుముమనసా ॥ అధ ॥ ఉత్తముఁడగుఁబురుషుండన్యుండని। యొప్పుగఁదెలియుముమనసా । ఉత్తముఁడతఁడేపరమాత్మయనఁగ । నొప్పుధరిత్రినిమనసా ॥ అధ ॥ శ్రీకరముగలోకత్రయముననావే । శించిభరించునుమనసా । ప్రాకటముగజ్ఞానార్కోదయమునఁ । బాసెనజ్ఞానముమనసా ॥ అధ ॥ అతీతుఁడైక్షరమునకక్షరమున । కతఁడుత్తముఁడైమనసా । క్షితివేదంబునఁబురుషోత్తముఁడనఁ । దెలఁగుఖ్యాతిఁగాంచిమనసా ॥ అధ ॥ భగవద్గీముఖులౌపురుషాధమసహ । వాసములోయుముమనసా । జగతిఁబురుషోత్తముసాకేతే । శ్వరునాశ్రయింపుముమనసా ॥

పున్నాగవరాళిరాగము - రూపకతాళము.

పల్లవి.

రామనయునినన్నుఁబ్రోవు । రాఘవేశ్వరా । శ్రీ । రాఘవేశ్వరా ॥

అనుపల్లవి.

కామజనకయభయమిమ్ము । కమలలోచనా ॥ రామ ॥

చరణములు.

నతునుపేక్షచేయఁదగునె । నళినజార్చితా । శ్రీ । నళినజార్చితా । క్రతుసంరక్షకుండవుగుణ । గణవరోదధే ॥ రామ ॥ నీదుసేవకొన్నవొల్ల । నిర్జరాధిపా । ఓ । నిర్జరాధిపా । నాదురితముమాన్పిబ్రోవు । నమ్మికొల్చెద ॥ రామ ॥ నతునిశోభయశము నఁగొని । నగుసులోకము । నన్ను । నగుసులోకము । నుతు

నినరసిప్రోవఁదగును । సుజనరక్షకా ॥ రామ ॥ ఇందునందుది క్కులందు । నెందువెదకితి । వి । న్నెందువెదకితి । ఎందునిన్నుఁ జూచినామదియందుఁజూచితి ॥ రామ ॥ యోనులందుఁబుట్టి చచ్చి । యోదయానిధే । నే । నోదయానిధే । మానవుండనై తినిపుడు । మామనోహరా ॥ రామ ॥ పెక్కుయోనులందుఁ బుట్టి । పెద్దకాలము । నేపెద్దకాలము । మిక్కిలినేనలసినాను మేదినీశ్వరా ॥ రామ ॥ అభయమిచ్చియుద్ధరింపు । మయ్యరా । ఘవా । నా । యయ్యరాఘవా । సభయునతుని వేగఁబ్రోవు । సజ్జనప్రియా ॥ రామ ॥ భూమిసాకేతపురినిఁ । బుట్టుటేటికి । నీవు । పుట్టుటేటికి । కోమలాంగనతులఁబ్రోవఁ । గోరియేకదా ॥

ముఖారిరాగము - ఆదితాళము.

పల్లవి.

రామనామమునెపుడు । సజ్జను । లేమరకజపింపుఁడు ॥

అనుపల్లవి.

కామజనకుఁడుభక్తముక్తులను । గడుసంతసమునవిచ్చుఁగా ॥

చరణములు.

కేశవుఁడనుకొనుఁడీ । మహిలో । నాశంబగునఘము । శ్రీశు నినవరతముసద్భక్తిని । కేశవుఁడనుకొనుఁడీ ॥ రామ ॥ నారా యణయనుఁడీ । భువిలో । మీరతిమోదమునన్ । ధారుణి నాలుకచేననయంబును । నారాయణయనుఁడీ ॥ రామ ॥ మాధ వుజపియింపు । సద్భక్తి । సీధరలోమునసా । భూధరధారినిశ్రీ పురుషోత్తము । మాధవుజపియింపు ॥ రామ ॥ గోవిందునిగ నుఁడీ । మీరు । తావకబంధనుగనుఁడు । శ్రీవల్లభునిదచిత్రముల శ్రీ । గోవిందునిగనుఁడీ ॥ రామ ॥ విసుఁడీవిష్ణుకథల్ । మీరు

అనయముసద్భక్తిఁ । మనురాజార్థంబునుభావించుచు । వినుఁ శ్రీవిష్ణుకథల్ ॥ రామ ॥ మధుసూదనుభక్తిఁ । మీరలి । మధురగుణాంబుధిని । బుధులారకరంబులఁబూజింపుఁడు । మధుసూదనుభక్తిఁ ॥ రామ ॥ త్రివిక్రమునెన్నిధికి । మీరలి । సవినయయుతులగుచు । భువిఁజరణంబులచేఁజనఁగందగుఁ । త్రివిక్రము సన్నిధికి ॥ రామ ॥ వామనపదతులసిఁ । క్యార । కామముపర్జించి । వేమారాఘ్రాణింపుడునాసిక । వామనపదతులసిఁ ॥ రామ ॥ శ్రీధరుమ్రొక్కుఁడు । భక్తిని । సాధుజనప్రియుశ్రీ । నాథునిశిరవిన్యస్తాంజలులై । శ్రీధరుమ్రొక్కుఁడు ॥ రామ ॥ భక్తివ్యాపీకేశుఁ । శ్రీహరి । భక్తజనప్రియుని । భక్తిముక్తిఫలదాయకుఁగొల్వుఁడు । భక్తివ్యాపీకేశుఁ ॥ రామ ॥ పద్మనాభుసతతంబు । శ్రీ । పద్మాపతిఁదగహృదయ । పద్మంబునభక్తిని నెలకొల్పుఁడు । పద్మనాభసతతంబు ॥ రామ ॥ దామోదరునెపుడు । మీరు । ఈమహిశ్రితులఁ । దామముచేనర్పించిభజింపుడు । దామోదరునెపుడు ॥ రామ ॥ శ్రీదశరధరాముఁ । నేనతి । మోదమునసుతింతుఁ । ద్వాదశనామునిసాకేతేశుని । శ్రీదశరధరాముఁ ॥ రామ ॥ ౭౧॥

ముఖారిరాగము - ఆదితాళము.

పల్లవి.

జనకజాప్రాణేశ్వరా । నన్ను । జాగుచేయకబ్రోవరా ॥

చరణములు.

వనశరణాగతువరసిరక్షింపుము । నారదగానలోలా । శ్రీ । ఇనకులకలశాబ్ధిపూర్ణశశాంకన । న్నేలుదయాలవాలా ॥ జనకజా ॥ నిన్నుసదాశకసుంగొనియానందించెదను । నిత్యవనాతులతోఁగను । రామ । మన్ననఁజేర్పుమునావిన్నపమును । మాధ

వక్రుఁడగాకొను ॥ జనకజా ॥ కామక్రోధాద్యరిషడ్వర్గముచేఁ జిక్కి । కష్టపడితినిచాలా । రామ । శ్రీమనోహరనన్నుఁజేపట్టి బ్రోవుము । శీఘ్రముగాగోపాలా ॥ జనకజా ॥ పంచేంద్రియము లకువశ్యుఁడనై పెక్కు । పాపముల్ చేసినాను । రామ । ఇంచు కగృపఁజూడుమీయాత్మనీయంఘ్రి । నిదుగోయర్పించినాను ॥ జనకజా ॥ సాకేతపురవాసనాతలనీపద । సరసీరుహముఁజేర్పు ము । రామ । శ్రీకరముగనానాలుకనీమంత్రముఁవ్రాసి । చెలగ భవముమాన్పుము ॥ జనకజా ॥ ౭౨॥

మధ్యమావతి రాగము - ఏక తాళము - ఖడ్గ.

పల్లవి.

జన్మముసఫలమయ్యెను । వెన్నుని సేవను । జన్మముసఫల మయ్యెను ॥

చరణములు.

శ్రీరంగేశుని శేషశయానుని । శ్రీరమవక్షముఁజేర్చినవానిని । వారిజాక్షుశ్రితవరమునిశ్రీహరి । నారాయణునాగారికేతనుని । శ్రీరమణీప్రియుశ్రీవత్సాంకుని । వారిజనయనునివరపీతాంబరు । నారదవీణానాదవినోదుని । భూరిదయాంబుధిఁబురుషోత్తముఁ గని ॥ జన్మము ॥ పంకజనాభునిభక్తక్రీతుని । శంకరవినుతుని జలధిశయానుని । బంకజనేత్రునిబరమదయాకరు । సంకటహర ణునిశౌరినిగేశవు । బంకజనాభునిభక్తవత్సలుని । గంకణహస్తు నిగంబుగ్రీవుని । బంకజవదనునిభక్తజనప్రియుఁ । బంకజధరుశ్రీ వాసుదేవుఁగని ॥ జన్మము ॥ గరుడవాహనునిగాత్మభవత్జుని । నరునారాయణునక్రకుండలుని । గరములఁజక్రముగదకోదం డము । లోకఖడ్గంబునుశాంచజన్యముతు । గరమొప్పమెచ్చుచుధరి యించుదువారి । సురులసహాయునిసూరిజనప్రియు । పరమపదం బునబరగెడువానిని । వరసాకేతపురాధీశునిగని ॥ జన్మము ॥

నీలాంబరిరాగము - అటతాళము.

చరణములు.

మునుమత్స్యమూర్తివైమునుపమునవేదను । వననిధినీడ్చిన రంగారంగా । అవయమునురహితమునకయిమందర । మునుధరియించినరంగారంగా ॥ నీరధిమునిగినధారుణిఁగిటియయి । గూరిమినెత్తినరంగారంగా । నారసింహుండయిభక్తునిబ్రహ్లాదుని । కోరికఁదీర్చినరంగారంగా ॥ వామనమూర్తివైబలినిమూడడుగుల । భూమినివేడినరంగారంగా । భీమబలునిఁగార్తవీర్యునిజమదగ్ని । రాముఁడైకూల్చినరంగారంగా ॥ అలకౌసల్యాసుతుండైయసురులఁజంపిన । జలధిగంభీరశ్రీరంగారంగా । హలియయి దుష్టులనరసిశిక్షించిన । బలరామదేవశ్రీరంగారంగా ॥ వసుదేవసూనుఁడైవరలదుష్టులగూల్చి । వసుధరక్షించినరంగారంగా । అసురవృత్తులఁగూల్పనలకల్కిరూపుఁగల । అలసాకేతేశశ్రీరంగారంగా ॥ ౭౮॥

సావేరిరాగము - ఆదితాళము.

పల్లవి.

చోరనాయక । శుభఫలదాయక । ఘోరకామాద్యరిసాయకా ॥

అనుపల్లవి.

శ్రీరమాబ్జకరపరిచితపాదా । నారదవీణానాదవినోద॥ చోర॥

చరణములు.

అరయవాహ్యాంబరుద్రవ్యంబును । తరుహరించుచోరులవలెఁగాక । శ్రీరమ్యాంతరవస్త్రాపహార్యమును చేఁ । చోరనాయకుండనఁ బరఁగితివిగ ॥ చోర ॥ శ్రీవైకుంఠవిహారమునురోసి । శ్రీవ్రజనరవధూ

మునకై వత్తుగా । శ్రీవేంకటాశైలంబునవేడుకఁ । జేరిభక్తామృత మైవెలసెదం ॥ చేర ॥ దేవదేవశరణాగతరక్షణ । దీక్షఁగైకొనిధరగడక్షణ । శ్రీవేంకటగిరివిహరించెదునా । శ్రితజనవత్సల వైకుంఠేశ్వర ॥ చేర ॥ సాకేతాఖ్యపురంబునఁబుట్టి । సకలాత్మలవైకుంఠముఁజేర్చిన । శ్రీకారుణ్యామృతవర్షముచే । లోకేశ్వరనాతాపముమాన్పుము ॥ చేర ॥　　౭౫॥

కన్నడరాగము - రూపకతాళము.

పల్లవి.

వరదా తడవేల ॥

అనుపల్లవి.

కరుణాలవాలనన్నేల ॥　　వరదా॥

చరణములు.

కరిభూధరశిఖరంబునఁ । గరుణాలయుఁడై నెలకొని । వరదుండై నతజనులను । గరమునుదయరక్షింతువు ॥ వరదా ॥ ఎందునుశిశువులఁబ్రోవగ । మందునుదినుమాతలవలె । ఇందువదన నన్నేలఁగ । ముందేటికనెలకొంటివి ॥ వరదా ॥ నాదురితముగణుతింపక । నన్నేలుమిలక్ష్మీశ్వర । నీదయవ్యర్థంబగుఁగద । యాదేవాధీశ్వరవినుము ॥ వరదా ॥ సాకేతపురాధీశ్వర । చాతకనిష్ఠుండగునను । శ్రీకరముగఁజేపట్టుము । శ్రీశకపోతమువాడ్కిని ॥ వరదా ॥　　౭౬॥

పున్నాగవరాళిరాగము - అటతాళము.

పల్లవి.

సదయుఁడానినుఁగొల్చెద । సద్భక్తిని । సదయాఁడినునుగొల్చెద ॥

అనుపల్లవి.

నవయాశీతలహృదయానతుఁబ్రోచు । టదియాకష్టముహ్రా యదివ్వాలయ ॥ సద ॥

చరణములు.

శ్రీతారకనామా । ననుబ్రోవు । శీతలగుణధామ । పాత కుఁడనినన్నుఁగరముపేక్షింపకు । మాతండ్రినసుగావదిక్కెవ రెవ్వరు ॥ సదయా ॥ ఆశ్రితపారిజాత । సాకేత । యమునిమ్ముకరుణచేత । స్వాశ్రితువిడనాడఁదగవేయిందిరనడిగి । సంశయమునుబాపిశోనినన్ను చేపట్టు ॥ సదయా ॥ నీకునడ్డముకలదె । సత్కృపమహి । నాకునొసఁగవల పోభీకరకామాదిశత్రువులకుఁగడు । భీతిల్లినినుశరణంబుఁజొచ్చితినయ్య ॥ సదయా ॥ ధరలంకేశునికిచ్చిన । అభయము । దానమునిటమరచిన । కరమునన్వారినినుఁజూచియాశ్రితజనులు । కడువేసనతుఁబ్రోవు సాకేతేశ్వర ॥ సదయా ॥ ౭౭ ॥

కేదారగౌళరాగము - రూపకతాళము.

పల్లవి.

ఇంతకోపమేలనాపై । యిందిరాహృదయేశయీశ ॥

అనుపల్లవి.

పంతమేలనతునిఁబ్రోవ । పాపంబగుఁగరిగిరీశ ॥ ఇంత ॥

చరణములు.

మాతృద్రోహియనకఁగాకి । మహిమఁబ్రోచినట్టికరుణ । భూతలమునమలినమయ్యె । బాలకునఁబ్రోవఁబూన ॥ ఇంత॥ మునువిభీషణుపికనభయ । మునునొసంగినట్టివేళ । ననునంగీకరింపకూడ । దనెడుసంకల్పంబుకలదె ॥ ఇంత ॥ గరళమునసీశా

సంగీవట్టి । కష్టహృదయయగురక్కసికిఁ । గరుణమోక్ష మొసంగి
తివటు । కావవేలనన్నువతుని ॥ ఇంత ॥ సాకేతపురమునబుట్టి ।
సకలజనులకిచ్చిముక్తి । నాశోకనికినొసంగకునికి । న్యాయముగు
నెసీతేశ్వర ॥ ఇంత ॥ ౭౮ ॥

బ్యాగురాగము - రూపకతాళము.

పల్లవి.

వరశంఖచక్రగదాధరద్వారకా । పురవాసాచ్యుతవేగరమ్మా ॥

అనుపల్లవి.

ధరగోవిందాపుండరీకాక్షనతునన్నుఁ । గరుణించినీవేలుకో
మ్మా । కరివరదానీనితరుల సామ్మా । శ్రీహరినావందనవందన
ముఁగైకోవమ్మా । అభయమిమ్మా । లెమ్మా ॥ వరశంఖ ॥

చరణములు.

నిన్నునమ్మిననన్ను నేర్పుతోఁబాలింప । కున్ననునగుబాటు
కాదా । అరి । మన్ననననుఁబ్రోవరాదా । నాయన్ననీవేగతి
కాదా । దయరాదా । వారా ॥ వరశంఖ ॥ తిరుగగజరాజుమొ
రవినినక్రము । గౌరవమునద్రుంచివైవ । కదుఁ - గూరిమితోవే
గరావ । ఈ - ధారుణిగతినీవేకావ । వాసుదేవ । బ్రోవ ॥
వరశంఖ ॥ చాతకనిన్నునన్నులకపోతమువలె । నాతంత్రిప్రోవమి
టులా । సా - కేతాఖ్యపురవరపాలా । గరుడ - కేతనకరుణాల
వాలా । శ్రీ - లోలా । చాలా ॥ వరశంఖ ॥ ౭౯ ॥

మోహనరాగము - అటతాళము.

కందార్థము.

శ్రీరంగాధిపులదముల । శ్రీరజిల్లఁగభజించిశ్రీరమ్యాంకా । గా
రవహృదయాలయముసః । తిరుగశ్రీకాముబిల్చి దివముగ[illegible]

లుతురా । సాకేతేశ । మనమునవలంతురా ॥ అనయముసుజ్ఞా
నాత్మాయగోమయంబుచే । వను లేపనము చేసియుద్భుతవిజ్ఞాన
మమరంగవల్లిపైవతిసుంచరసత్య । ఘనసింహాసనమునంగామత్స
నెలకొల్పి ॥ దినమును గొలుతురా । సాకేతేశ । మనమునఁ
లంతురా ॥ ౮౦ ॥

మధ్యమావతిరాగము - అటతాళము.

కందార్థము.

జనకసుతాహృదయేశ్వరు । మనమందిరనిలయు బ్రోలమా
నుగిరిజే । శునివలెనానందముపైఁ । గొనితాండవమును నె
నర్తు । కోరికతోడఁ । శ్రీవనమాలా । హారునినీడఁ ॥ గౌర
వమునశాంతికాసారమునఁగ్రుంకి । ధారుణీదాంత్యాఖ్యధాతాం
బరముఁదాల్చి । వైరాగ్యతిలకంబుఁగలనెత్తినిదిద్ది । తారకనా
మంబుఁదనరఁబాడుచునెపుడు । కోరికతోడఁ । శ్రీవనమాలా
హారునినీడఁ ॥ ౮౧ ॥

యదుకులకాంభోజరాగము - జంపెతాళము.

పల్లవి.

వినుమునావిన్నపము వేడ్క శ్రీరంగేశ । ననునీవు బ్రోవ
రాదా । నాస్వామి ॥

అనుపల్లవి.

వనజాతుసీపాద । వనజములసేవించు । ననుబ్రోవు రంగ
నాథా । నాస్వామి ॥ వినుము ॥

చరణములు.

నాగారిపైనెక్కి । నాగుణాఘము బ్రోవ । నగమెంచేయు
మహీర్య । నాస్వామి । భోగీంద్రశయనుండై । భూజనంబుల

గాచు । దొరా గేశరంగనాథా । నాస్వామి ॥ వినుము ॥ నీకు ్రమొక్కితిదేవ । నీకన్యమేనెరుఁగ । నాకభయమిమ్ముగోవింద । నాస్వామి । లోకంబులనుగుక్షి । లోనుంచిరక్షించు । శ్రీకాంతరంగనాథా । నాస్వామి ॥ వినుము ॥ వనజాసనాదిదే । వతల ద్భుతంబంద । వనగజముఁబ్రోవలేదా । నాస్వామిా । వినుఁ జూడఁగోరునీ । కనులన్యమునుజూడ । దనయంబురంగనాథా । నాస్వామీ ॥ వినుము ॥ నీకథలవినుచుందు । నీనామముజపింతు । శ్రీకంతనుతరంగనాథా । నాస్వామి । సాకేతపురనాథ । జానకీ ప్రాణేశ । శ్రీకంఠచాపభంగా । నాస్వామి ॥ వినుము ॥ రా-॥

శంకరాభరణరాగము - రూపకతాళము.

ప ల్ల వి.

రంగేశ్వరరంగేశ్వరరంగేశ్వరరంగేశ్వర । రంగేశ్వరరంగేశ్వ రరంగపురీవిలయా ॥

చ ర ణ ము లు.

మత్స్యుండై మునుసోమకు । మకరాలయమునఁగూల్చిన ॥ రంగేశ్వర ॥ కూర్మంబై సురహితముగఁ । గుధరంబునుధరియించిన ॥ రంగేశ్వర ॥ ప్రళయోదధిమగ్నంబగు । వసుధనుగిటియై యెత్తిన ॥ రంగేశ్వర ॥ వరదుండై ప్రహ్లాదుని । నరసింహాండై కాచిన ॥ రంగేశ్వర ॥ వామనుఁడై మూడడుగుల । భూమినిబలియాచించిన ॥ రంగేశ్వర ॥ జమదగ్నితనూజుండై । క్షత్రియులనుమహిఁగూల్చిన ॥ రంగేశ్వర ॥ దశరథరాజసుతుండై । దశకంఠాదులఁదునిమిన ॥ రంగేశ్వర ॥ సాధుపరిత్రాణంబును । జయ్యనహలియై చేసిన ॥ రంగేశ్వర ॥ వసుదేవతనూజుండై । వసుధనుగూర్మినిబ్రోచిన ॥ రంగేశ్వర ॥ కలిదోషముమాన్పుటకై । కల్కియైపుట్టంగలవారి ॥ రంగేశ్వర ॥ సాకేతపురాధీశ్వర । శ్రీకంఠార్చితపాదా ॥ రంగేశ్వర ॥ రా-॥

## హిందుస్థాని కాపిరాగము - ఆదితాళము.

పల్లవి.

యమయాతనలకు నేవెరగంది । యచ్యుతనిను జెందితిరక్షించు ॥

చరణములు.

పరసుతసతిహాస్యంబును జేయుఁ । బాపాత్ముఁడు తామిస్రముఁ
జెందుఁ ॥ యమ ॥ ధరణీధరపరసతిరతుడంధ । తామిస్రంబున
దుఃఖముఁ జెందుఁ ॥ యమ ॥ స్వకుటుంబార్థము పరులకు బాధ ।
చయ్యనఁ జేసిన రౌరవమబ్బుఁ ॥ యమ ॥ తనుపోషణమునకై బి
లరోధం । బొనరిచి కుంభీపాకముఁ జెందుఁ ॥ యమ ॥ కడున
హితంబును గురులకుఁ జేయుఁ । కాలసూత్రంబను నరకమగుఁ ॥
యమ ॥ శ్రుతిమార్గంబును విడిచి చరించు । పతితులకసిపత్రవనం
బబ్బుఁ ॥ యమ ॥ అదయుండై జంతువులను జంప । నంధకూపం
బను నరకమగుఁ ॥ యమ ॥ కలిమిని బరులకుఁ బెట్టకఁ గుడుచుఁ ।
గష్టునకుం గ్రిమిభోజనమబ్బుఁ ॥ యమ ॥ మహిజాత్యాశ్రయ
దుష్టముఁ గుడువఁ । మలమూత్రక్రిమిభోజనమబ్బుఁ ॥ యమ ॥
భగవదనివేదితభోజనము । పశుమాంసాశనమగుఁ దద్దయును ॥
యమ ॥ వసుధను హరివాసరమున గుడువఁ । పంచమహాపాత
కఫలమబ్బుఁ ॥ యమ ॥ శ్రీరంగేశ్వరసాకేతేశా । చేపట్టుము దు
రితభీరువునన్నుఁ ॥ యమ ॥ ౭౨॥

## దేశికతోడిరాగము - రూపకతాళము.

పల్లవి.

ఏమికరుణరాదా । నే । నేమిచెప్పుదు । రామభూమీశా । శ్రీ ।
రంగనాయకా ॥

చ ర ణ ము లు.

అమలుఁడైనరామ । దే । వాధిదేవనీ । కమలపాదము । నా । కనులనున్నది ॥ ఏమి ॥ భక్తవరదనీ । ఆ । పాదచూడము । భక్తిఁగాంచితి । భవ । భయముఁబాసితి ॥ ఏమి ॥ నీమనోహర । మగు । నీలదేహము । నామనంబునఁ । గడు । నాటియున్నది ॥ ఏమి ॥ వేదవేద్యనీ । మూర్తి । వేడ్కఁజూచిన । నాదుక న్నులు । అ । వ్యమునుజూడవు ॥ ఏమి ॥ వాసుదేవనీ । ని । ర్వ్యాజకరుణను । భాసురంబుగఁ । జేఁ । బట్టినాఁడవు ॥ ఏమి ॥ శ్రీకంఠార్చిత । దివ్య । శ్రీపదాంబుజ । సాకేతేశ్వర । శ్రీ । జాన కీపతే ॥ ఏమి ॥ రామ॥

అపరూపరాగము - ఆదితాళము.

ప ల్ల వి.

నాథాచోరనాయకా । శ్రీ । నాథాచోరనాయకా ॥

అ ను ప ల్ల వి.

భూధరాశుభదాయకా ॥ శ్రీ ॥ నాథా॥

చ ర ణ ము లు.

రామానుజేశోమ్మా । నా । స్వామీయభయనిమ్మా ॥ శ్రీ ॥ నాథా ॥ పతుముంచమునీశేశ్వరా । నను । రక్షించురా ఘువేశ్వరా ॥ శ్రీ ॥ నాథా ॥ దక్షిణాచలనాయకా । ఓ । రక్ష కాముక్తిదాయకా ॥ శ్రీ ॥ నాథా ॥ సాకేతపురనాయకా । దైత్య । భీకరారఘునాయకా ॥ శ్రీ ॥ నాథా ॥ రామ॥

ఫరజురాగము - రూపకతాళము.

ప ల్ల వి.

రారారఘువీర । పారావారగంభీర ॥

అనుపల్లవి.

శ్రీరమాధిదేవ । చేరరమ్ము దేవ ప్రోవ ॥ రారా॥

చరణములు.

పాపమెంతో చేసిమిగులఁ । బాపినేనైతినయ్య । నీపదన్య స్తభరుఁడై । నీసన్నిధిచేరినాను । కోపగింపవలదునాపై । కుధ రధరరమాధినాథ ॥ రారా ॥ కరముఁదిట్టిశిశుపాలుండు । గరళ మిచ్చిపూతనయును । పరమపదముఁగాంచిరనుట । ధరణిఁగల్ల యౌనిజంబౌ । శరణుచెందినట్టినన్ను । జగతిఁగావవేలచాల ॥ రారా ॥ జనని స్తనముఁబుండుచేసి । జగతిలోఁగాకాసురుండు । తనువుఁజుట్టిమిగులఁగరచి । తద్దయునుగాళియాహి । మనిరను టనిజుబౌ కాదో । మహినలునినన్నేల వేల ॥ రారా ॥ సాకేతపు రినిబుట్టిసకలాత్మలకునుముక్తి । శ్రీకరముగనొసఁగితివని । చెప్ప దరదినిజమొకాదో । నాకునభయమొసఁగకునికి । న్యాయమెశరు ణాలవాల ॥ రారా ॥ ౮౭॥

జంఝూటిరాగము - ఆదితాళము.

పల్లవి.

రంగనాథానన్నుఁగరుణ । రక్షింపుముస్వామీ ॥ శ్రీ ॥

అనుపల్లవి.

అంగజజనకాదివ్యతులసీ । హారాయిటురారా ॥ శ్రీ ॥ రంగ॥

చరణములు.

నిరపరాధినిబ్రోచుటకష్టమా । నీరజభవనుతనామా । భవప పరాధినిబ్రోవవేనినీ । దయకుఁబ్రయోజనమేమిస్వామి ॥ రంగ ॥

* నన్ను స్మరింపుమునిన్ను బ్రోతుననని । మున్ను విభీషణునికిని । పన్నుగఁబల్కినీవేయశ్రమమగు। పథమునుగైకొనవేలా మేలా॥ రంగ ॥ కరిద్రౌపదిప్రహ్లాదులఁగాచిన । కరుణాకరనతునన్నుఁ । గరుణఁబ్రోవమిచోద్యంబయ్యెడు । కమలాలయ హృదయాధినాథ ॥ రంగ ॥ సాకేతపురినిసకలాత్మలకును । సద్గతినొసఁగినరామా । శ్రీకంఠార్చితపాదానీకృపఁ। జెలగనిపుడునాకీదరాద॥

దర్బార్ రాగము - ఆదితాళము

పల్లవి.

శ్రీరామాగుణధామా ॥

అనుపల్లవి.

శ్రీరఘుకులకలశోదధిసోమ ॥ శ్రీరామా॥

---

* పాద్మోత్తరపురాణే ౭౫ అధ్యాయే.

మంత్రపూతజలైశ్శుద్ధైర్మునయస్సంశ్రితవ్రతాః । జపంతో వైష్ణవాన్సూక్తాన్ చతుర్వేదమయాన్ శుభాన్ । అభిషేకంశుభంచక్రుః కాకుత్స్థంజగతాంపతిమ్ । తస్మిన్ శుభతమేలగ్నే దేవదుందుభయోదివి । నినేదుఃపుష్పవర్షాణివవర్షుంచసమంతతః। దివ్యాంబరైర్భూషణైశ్చదివ్యగంధానులేపనైః । పుష్పైర్నానావిధైర్దివ్యైఃదేవ్యాసహరఘుద్వహః। అలంకృతశ్చశుశుభేమునిభిర్వేదపారగైః। ఛత్రంచచామరందివ్యంధృతవాన్ లక్ష్మణస్తథా। పార్శ్వేభరతశత్రుఘ్నౌ తాలవృంతేవివేజతుః। దర్పణంప్రదదౌ శ్రీమాన్ రాజేంద్రోవిభీషణః । దధారపూర్ణకలశంసుగ్రీవోవానరేశ్వరః । జాంబవాంశ్చమహాతేజాఃపుష్పమాలాంమనోహరామ్ । వాలిపుత్రస్తుతాంబూలంసకర్పూరందదౌప్రియాత్ । హనూమాన్ దీపికాందివ్యాంసుషేణస్తుధ్వజంశుభమ్ । పరివార్యమహాత్మానంమంత్రిణస్సముపాసిరే ॥

చ ర ణ ము లు.

శ్రీమాధవనీపదపద్మంబుల । శ్రీమించగమతినుంతు । నా - స్వామికదువందింతు । నిను - వేమారునునుతియింతు । సంత సింతు । ఎంతు ॥ శ్రీరామా ॥ ధారుణిసీపదనిత్యసేవసేఁ । గోరు దుఁగరుణాలవాల । మది - గోరనన్యంబును నేల । రఘు - వీర యికనుజాగేల । శ్రీలోల । చాల ॥ శ్రీరామా ॥ కరముఁబావ నికరములమెలఁగుశ్రీ । కరమగుపదములఁజెమ్మా । శుభ-కరము గమదికిరానిమ్మా । శ్రీ - కరముగమనివిఁగైకొమ్మా । వేగ - రమ్మా । లెమ్మా ॥ శ్రీరామా ॥ సాకేతపురాధీశ్వరనీకృప । శ్రీక రముగఁగమగొంటి । ఈ - లోకంబునమనఁగంటి । శ్రీ - కాకు త్స్థవేదుకొంటి । శరణంటి । కంటి ॥ శ్రీరామా ॥ రాణ॥

హిందుస్థాని కాపిరాగము - ఆదితాళము.

ప ల్ల వి.

జనకజాహృదధ్యేశరమ్మా ॥

అ ను ప ల్ల వి.

నా ॥ మనవిఁగైకొనియభయమిమ్మా ॥ శ్రీ ॥ జన॥

చ ర ణ ము లు.

భవజలధినిదాటఁజాల । శ్రీ । భవజ్ఞానకరమిమ్ముచాల ॥ శ్రీ ॥ జన ॥ అరిషడ్వర్గభయముఁబాప । ఈ । ధరపినేగతిశార్ఙ్గ చాప ॥ శ్రీ ॥ జన ॥ చిత్తజుచేఁగష్టపడితి । నీ । మొత్తనికృపవ న్మినీద్రోలఁబడితి ॥ శ్రీ ॥ జన ॥ పావని నేలినరామా । ముక్తి ప్రోవఁజాపుముగుణధామా ॥ శ్రీ ॥ జన ॥ శాంతిదాంతులను వేడెదను । అతి । సంతసముసన్నిధినిగూడెదను ॥ శ్రీ ॥ జన ॥ సాకేతపురవరపాల । నేను । నీకన్యకెందుల్లనుజాల ॥ శ్రీ ॥ జన ॥

కమానురాగము - రూపకతాళము.

పల్లవి.

నీవేనన్నుఁబ్రోవదిక్కు । నిర్మలగుణజాలచాల ॥

అనుపల్లవి.

కావవేనినిర్దయుఁడని । కఠినపలుకువినఁగనేల ॥ నీవే॥

చరణములు.

కాకముఁగృపఁగాచినదియుఁగడలినిమన్నించినదియు । శ్రీకరముగఁబెక్కునతులఁ । జేకొన్నదియునిక్కమేని ॥ నీవే ॥ తప్పులెన్నోచేసినాను । ఇప్పుడునిన్నుఁజెందినాను । తప్పులెన్నఁదగునెయికను । తప్పునీయందేనిలుచు ॥ నీవే ॥ కనకకశిపురావణునివా । లినిమన్నాథకూల్పనేల । తనరఁబ్రహ్లాదునివిభీష । ణునిసుగ్రీవుఁబ్రోవఁగాదె ॥ నీవే ॥ పూతనకంసాదిఖలులఁ । బొమ్మంటివిమోక్షమునకు । నాతంద్రినతునివిడువ । నగునునిన్నుఁజూచిజగము ॥ నీవే ॥ తల్లినిగ్రహించునేని । స్తనంధశిశువుదానివిడువ । నెల్లనిక్రియనిన్నువిడువ । నొల్లనుసాకేతనాథ॥

ధన్యాశిరాగము - ఆదితాళము.

పల్లవి.

శాంతినిగైకొనుఁడీ । మరియును । దాంతినిజేకొనుఁడీ ॥

అనుపల్లవి.

శాంతిదాంతులుకలిగినముక్తిని । గాంతురునిజమీవధ్యముఁగొనుఁడీ ॥ శాంతి ॥

చరణములు.

మనసునుహరినిలయముచేయుండు । మహాపాపములనీచులఁదోలుండు । తనరమాధవునినటనిల్పుండు । తద్దయుభక్తిని

బూజింపుండు ॥ శాంతిని ॥ దుర్విషయంబులఁజింతింపకుఁడు । దుష్టులసహవాసముఁగోరకుఁడు । ఈర్ష్యనిమదనవశ్యులుకాకుండు। ఓర్పుకలిగియెంతయుమెలగుండు ॥ శాంతిని ॥ హరికీర్తినిభక్తిని నుతువుండు । అసత్యమునునాలుకఁజేర్పకుఁడు । ధరసత్పురుషు లకడఁజేరుండు । తద్దయుధర్మంబునుచేయుండు ॥ శాంతిని ॥ జీవహింసనుమదిరోయుండు । శ్రీహరివాసరమునఁగుడువకుఁడు। శ్రీవిష్ణుగుణంబులఁజొక్కుండు । శ్రీసాకేతేశునిబాడుండు ॥ శాంతిని ॥ ౯౨॥

సురటిరాగము - రూపకతాళము.

పల్లవి.

గంతులువేసెదను । భగవంతునిగనిచొక్కిచొక్కి ॥ గంతు లువేసెదను ॥

అనుపల్లవి.

ఎంతయునానందాంబుధి । సంతసమునగ్రుంకిగ్రుంకి ॥గంతులు॥

చరణములు.

హృదయాలయమునసెంతయు । సదయుండై నెలకొనినా । మదికింపునుజెప్పెదుహరి । మృదుపాదంబులసన్నిధి ॥ గంతులు ॥ దుష్టులసంగతిరోసి । శిష్టులగోష్ఠినిగూడి । ఇష్టముతోహృద యాలయు । స్పష్టంబుగఁగనిముదమున ॥ గంతులు ॥ కరముల హరిఁబూజింపుచు । శిరమునహరివందింపుచు ॥ గరిగిరిపతినుతి యింపుచుఁ । బురుషోత్తముఁజింతింపుచు ॥ గంతులు ॥ సాకేత పురాధీశ్వరు । సన్నిధిఁబావనినారద । శ్రీశంకాదులవలెనే । శ్రీక రముగసాత్రుఁడనై ॥ గంతులు ॥ ౯౩॥

నాధనామక్రియరాగము - ఆదితాళము.

చ ర ణ ము లు.

రామునిసద్గుణములవినిచొక్కుచు । రంజిల్లునుమహిశిష్టుఁడు । కామాంధుఁడై కుత్సితకధలనువిని । కడురంజిల్లునుదుష్టుఁడు ॥ దీనజనులఁబోషింపఁగఁగోరును । దీనదయాళుఁడై శిష్టుఁడు । దీనులనిర్దయఁదిట్టుచుగొట్టును । హీనబుద్ధియగుదుష్టుఁడు ॥ శాస్త్రార్థంబునుసతతమువినుచును । సంతసమందును శిష్టుఁడు । శాస్త్రంబునుదూషించుచుఁదిరుగును । శఠుఁడై యెంతయుదుష్టుఁడు ॥ కరములశ్రీహరియర్చనచేయుచుఁ । గాలముగడుపునుశిష్టుఁడు । కరముఁబాపంబులనేచేయును । గడుఁగష్టుండగుదుష్టుఁడు ॥ విద్యావినయయుతుండై మేదిని । వెలయుఁగీర్తిఁగాంచిశిష్టుఁడు । మద్యమాంసంబులఁగడుమెక్కుచు । మత్తుఁడై తిరుగునుదుష్టుఁడు ॥ సత్యవ్రతుఁడై సాధుగోష్ఠిఁజేరి । జగతిమెలంగునుశిష్టుఁడు । సత్యహీనుఁడై సాధులఁదిట్టుచు । సంచరించుఁగడుదుష్టుఁడు ॥ ధర్మంబునెయెల్లప్పుడుఁజేయును । ధర్మాత్ముండగుశిష్టుఁడు । ధర్మమునించుకయైననుజేయకఁ । దడఁబడునెంతయుదుష్టుఁడు ॥ పరవనితావిత్తంబులనొల్లకఁ । బరనిందకునోయుశిష్టుఁడు । పరవనితావిత్తాపహారుఁడై । పరమాషణఁజేయుదుష్టుఁడు ॥ లోకంబంతయుహరిమయమనితన । లోనుప్పొంగునుశిష్టుఁడు । లోకనాశమునుదనయుచ్ఛ్రియము । లుబ్ధుఁడై కోరునుదుష్టుఁడు ॥ అచ్యుతసేవకునన్యంబొల్లం । డతిశాంతుండగుశిష్టుఁడు । అచ్యుతవిముఖుండై విషయసుఖము । ననవరతముఁగోరుదుష్టుఁడు ॥ అహంకారమమకారంబులకెడబాసి యుకవర్తించునుశిష్టుఁడు । అహంకారమమకారంబులఁద్రోచుచు । నతిక్రూరుండగుదుష్టుఁడు ॥ కోపముపాతకమునకుమూలం

బని । కూల్చునుదానినిశిష్టుఁడు । కోటంబునెత్రాకారంబుగఁగ్గై ।
కొనిపాపియగునుదుష్టుఁడు ॥ నూరులక్షిష్టాతిథిరై శ్రీహరి । సా
రదినిగొల్చునుశిష్టుఁడు । క్రూరకాలునిక్షిష్టాతిథిరై । కూలునర
కమునదుఃష్టుడు ॥ సాకేతేశునిదాసదాసుఁడై । సద్గతిఁగాంచు
నుశిష్టుడు । లోకమునమన్మథదాసుఁడైయమ । లోకముఁ
జెందునుదుష్టుఁడు ॥ ౫౮॥

కమాసురాగము - ఆదితాళము.

పల్లవి.

స్వామీనామొఱవినవేమి । ననుగావవేమి ॥ స్వామీనామొ
ఱవినవేమి ॥

అనుపల్లవి.

రామనాహృదయేశ । స్వామిశ్రీసీతేశ । స్వామీ॥

చరణములు.

కాకముఁగాచిన । కరుణానిధివని । శ్రీకరముగనిన్నుఁ । జేరితి
ననుబ్రోవు ॥ స్వామీ ॥ శంఖచక్రధరుండ । జ్ఞానముధ్రువునికి ।
శంఖస్పర్శముచేసె । సఁగినట్లునాకిమ్ము ॥ స్వామీ ॥ గజరాజు
మొరవిని । కరుణరక్షించినట్లు । నిజదాసునిగనేలు । నేర్పునన
తునన్ను ॥ స్వామీ ॥ సాకేతనగరేశ । శరణాగతునిగావ ।
రాకున్నఁదగవే శ్రీ । రామతారకనామ ॥ స్వామీ॥ ౫౯॥

హిందుస్థాని కాపిరాగము - ఆదితాళము.

పల్లవి.

ఇంతకోపమా । స్వామిన । న్నింతయురక్షింప । ఇంతకో
పమా ॥

అనుపల్లవి.

సంతతముహృదయేశ । సంరక్షింపవేలజాల ॥ ఇంత॥

చ ర ణ ము లు.

సురగణనాయకనిన్ను । సుందరాంగవేడినాఁడ ॥ ఇంత ॥ శర
ణనివేడిననన్ను । స్వామివేగబ్రోవరమ్ము ॥ ఇంత ॥ ఇతరులనే
నెంతయును । ఇందిరేశవేడనొల్ల ॥ ఇంత ॥ నీవేనాదేవుఁడవు ।
నీరజార్చితాంఘ్రియుగ్మ ॥ ఇంత ॥ సారదినిబ్రోవుమునన్ను ।
చోరనాధవైకుంఠేశ ॥ ఇంత ॥ ఇలననుబ్రోవుముసాకే । తేశ
దక్షిణాచలేశ ॥ ఇంత ॥ ౯౬॥

మోహనరాగము - రూపకతాళము.

ప ల్ల వి.

స్వామిరవికులాబ్ధిసోమ । సకలసద్గుణాభిరామ ॥

అ ను ప ల్ల వి.

రామకాస్తుభాభిరామ । సోమమౌళివినుతనామ ॥ స్వామి॥

చ ర ణ ము లు.

మంగళముగననుఁబ్రోవుము । మాధవశ్రీమధుసూదన । జం
గమశ్రీహృదయాలయ । జన్మంబునుదొలఁగింపుము ॥ స్వామి॥
నీకరుణనునిన్నెఱిఁగితి । నీపదచ్ఛాయనెమెలఁగితి । శ్రీకరము
గఁజేపట్టుము । చేరనునేనొరులనీడ ॥ స్వామి ॥ నీపదసేవనె
మరిగితి । నీమంత్రమెజపియించితి । కాపురుషులవలెనెంతయుఁ ।
గామింపనునీకన్యము ॥ స్వామి ॥ నీవేతల్లియుఁదండ్రియు । నీ
వేగురువునుదైవము । నీవేనాకిలసర్వము । నిక్కముసాకేతే
శ్వర ॥ స్వామి ॥ ౯౭॥

హంసధ్వనిరాగము - ఆదితాళము.

ప ల్ల వి.

రామాసుగుణాబ్ధిసోమ । రక్షింపుమువేగ । రామాసుగు
ణాబ్ధిసోమ ॥

అ ను ప ల్ల వి.

వేమారునుతించెద | దారకనామా ॥ రామా ॥

చ ర ణ ము లు.

భీమభవాంబుధిమగ్నునినన్నుఁ | బేర్మినుద్ధరింపుముజ్ఞానహ స్తముచే ॥ రామా ॥ కామాంధుఁడైకడుఁగష్టపడెదునాకుఁ | గరుణనుజ్ఞానాంజనమునొసంగుము ॥ రామా ॥ ఇల్లనుచీకటి నూతఁబడినన్నుఁ | గల్లలేనికృపనుద్ధరింపుముదేవ ॥ రామా ॥ సంసారాటవిమెలఁగుచుండెదునాకు | సాకేతపతిముక్తిపథము నుజూపుము ॥ రామా ॥ రా॥

ఆనందభైరవిరాగము - అటతాళము.

ప ల్ల

రథస్థుండగుగేశవునిసేవించిన | వాడుజన్మమికను ॥

అ ను ప ల్ల వి.

కుధరధరునిశ్రీ | కుంజరగిరిధవు | బుధజనవినుతుని | బురు షోత్తమువారి ॥ రథస్థుండగు ॥

చ ర ణ ము లు.

పురుషోత్తముఁడుపంచ | భూతమయములగు | అరదంబు లరచించి | యాత్మలకిచ్చెను ॥ రథస్థుండగు ॥ దివ్యరథమునదు మఁ | దేజరిల్లెడుహృదయ | భవ్యాబ్జాసనమునఁ | బరమాత్మ ముదమందు ॥ రథస్థుండగు ॥ ఆసనముపైమించి | యాత్మాఖ్య దివ్యచి | త్రాసనమునవేం | చేసెసీతాపతి ॥ రథస్థుండగు ॥ ఇంద్రియతురగంబు | లీడ్చునీరథమును | అందముగామనం | బురథసారథియయ్యె ॥ రథస్థుండగు ॥ ఆశ్వంబులకుబుద్ధి | యమ మఁబగ్గంబగుచు | విశ్వంబునసుగడు | వెలయుఖ్యాతినిగాంచి॥

రథస్థుండగు ॥ జముబురిఁజేర్చువి । వయవీధినిఁబోవ । అమ రము క్తినిఁజేర్చు । హరిభక్తిమార్గంబు ॥ రథస్థుండగు ॥ సాకే తేశ్వరుకృప । సద్గతిఁజేరఁగ । శ్రీకరముగమనకుఁ । జేకూడె నీరథము ॥ రథస్థుండగు ॥ ౯౯॥

హిందుస్థాని కాపిరాగము - ఆదితాళము.

పల్లవి.

వేంకటరమణునిసంకటహరణుని । శంకవిడిచిమదినెంతు ॥

అనుపల్లవి.

శంకరవినుతునిబంకజనయనుని । సంతతమునుభజియింతు ॥

చరణములు.

అక్కట యెంతయుఁ బాపముచేసితి । నదితలఁచిభయంబంది । చుక్కలరాయని సోదరిభర్తను । సారదినిజేరి రమింతు ॥ వేంకట ॥ భవఘోరాంబుధిపారముఁజేరమా । ధవుపదపద్మమె తగునావ । అవనినింద్రియములగుదియించి । యచ్యుతుభక్తి నుతింతు ॥ వేంకట ॥ నారదవీణానాదవినోదుని । నామనమున నెలకొల్పి । గారవముననహింసాదిపుష్పములఁ । గడుభక్తి నినర్చింతు ॥ వేంకట ॥ కాలమువ్యర్థముచేయకసీతా । కాంతునికింకరుఁడగుచుఁ । జాలముదంబునసాకేతేశుని । సద్భక్తినివందింతు ॥ వేంకట ॥ ౧౦౦॥

నాథనామక్రియరాగము - ఆదితాళము.

పల్లవి.

ఎన్నాళ్లునేనోర్తునువరదరాజ । ఎట్లికనేదాళగలనోయిందిరేశ ॥

అ ను ప ల్ల వి.

నిన్నెనుతింతునునీకన్యమెరుఁగను । నన్నిట్లుపేక్షింపన్యాయ మానాస్వామి । నన్నునీవు । శ్రీనాథప్రోవు । నాకిదియలావు । పన్నగాధినాథశయన ॥ ఎన్నాళ్లు ॥

చ ర ణ ము లు.

ఇంద్రియములబాధనెట్లోర్తునోస్వామి । సంచియమేలనన్న య్యనఁ చేపట్ట । ముందెనేను । కడుముదములోను । నిన్నెవే డినాను । ఇందిరాధినాథస్వామి ॥ ఎన్నాళ్లు ॥ కామక్రోధాదులు కడుఁగష్టపరతురు । నామొరలాలించిననన్నేలవదియేల । స్వామి నమ్ము । నాయంజలినిగొమ్ము । నాకభయమిమ్ము । కామజనకఁగరు ణఁప్రోవు ॥ ఎన్నాళ్లు ॥ కరిరాజుఁప్రోచినకరుణానిధియని । కర మునీకీర్తినిఘనముగనమ్మితి । వరదదేవ । నన్నరసికావ । భువిది క్కునీవ । కరిగిరీశమరువఁదగునె ॥ ఎన్నాళ్లు ॥ శరణాగతుఁడెనన్ను ధరనుపేక్షించిన । వరదుఁడనుకీర్తివన్నెకెక్కునెదేవ । మరువ కెంతు । నామదినిన్నుంతు । ఎప్పుడునుతింతు । వరదసాకేతాధి నాథ ॥ ఎన్నాళ్లు ॥ ౧౦౧॥

సహానారాగము - రూపకతాళము.

ప ల్ల వి.

మరచుటన్యాయమా । మన్నాథకరిశైలాధినాథ । మరచు టన్యాయమా ॥

అ ను ప ల్ల వి.

వరదనిన్నెనమ్మినాను । కరముపేక్షచేయఁదగునె । కరిపతిద యఁగాచినట్టి । కరుణాంబుధివనినమ్మితి ॥ మరచుట ॥

చ ర ణ ము లు.

కరమునుగిరిశిఖరమందుఁ । గనవుమనగుచుండువశువు । ధరణిమెలఁగువత్సంబునే । తద్దయనుదలంచుకాదె ॥ మరచుట ॥ తల్లినిగ్రహించునేని । దానికరుణఁదలఁచివిడువ । నొల్లకనేడ్చుశిశువుభంగి । నుల్లంబుననిన్నువలఁతు ॥ మరచుట ॥ శిశువుపాలుకేడ్చుచుండ । వశమెతల్లికినిభుజింప । భృశమునేనుగష్టపడఁగ । యశమెనీకుఁనన్నుమరువ ॥ మరచుట ॥ తెలివిలేకపాపినైతిఁ । దేర్పుమునాథయమమూన్పి । ఇలనుసాకేతనాథ । యెందునేనులవేడనన్ను ॥ మరచుట ॥ ౧౦౨॥

ఆనందభైరవిరాగము - రూపకతాళము.

ప ల్ల వి.

కరుణనాపైఁగలుగదేలయో । కరిగిరీశ । ధరణినీకుఁగోపమేలయో ॥

అ ను ప ల్ల వి.

కరుణనాపైఁగలుగదేల । కంజజార్చితాంఘ్రిపద్మ । ధరణఁబ్రాప్యప్రాపకములు । తండ్రినీవెకాదెనాకు ॥ కరుణ ॥

చ ర ణ ము లు.

పెక్కుయోనులందుఁబుట్టితి । నెంతయును । బెక్కుమందిరములమెట్టితి । ఆక్కరతోనావెంటఁదిరిగి । యాళిముఖ్యంబుఁగాన । కక్కటావేసరితివపుడు । చిక్కితివుడునీదువలను ॥ కరుణ ॥ నెట్టినభవాబ్ధిపతితుఁడై । నట్టినన్నుఁ । బట్టఁగోరినీవుమిక్కిలి । అట్టిపొంచిపుట్టికరుణ । యనెడువలనువేసినన్ను । బట్టవైతివిపుడునీ । పట్టుఁగోరివచ్చినాను ॥ కరుణ ॥ నీకటాక్షంబుచేనిను । నెఱిఁగియిపుడు । ప్రాకటముగనీదయాబ్ధిని । శ్రీకర

ముగ గ్రుంకఁగోరి । చేరితినీపాదములను। నాకునభయమొసఁగ కునికి । న్యాయమేరమాధినాధ ॥ కరుణ ॥ సాకేతపురవరాధిపా । నాహృదయ । జంగమదివ్యాలయంబున । శ్రీకరముగ వేంచేసి । భీకరాఘభయముఁబాపి । శ్రీకంఠవినుతమగుచుఁ। జెలగునీమంత్రము నొసంగు ॥ కరుణ ॥ ౧౦౩॥

## శ్రీ సీతాకల్యాణము.

యదుకులకాంభోదిరాగము - చాపుతాళము.

పల్లవి.

కనులకరువుతీరనేడు । కంటిరాముని । మునులభాగ్యరాశియైన । మోహనాంగుని ॥

చరణములు.

రాతినాతిఁజేసినట్టి । రామచంద్రుని । సీతఁగూడిపెండ్లిపీటఁ। జెలఁగువానిని ॥ కనుల ॥ జనకచక్రవర్తిమిగుల । సంతసంబున। తనతనూజరాఘవునకు । ధారపోసెను ॥ కనుల ॥ మంగళంబుఁ బాడిరప్పుడంగనామణుల్ । మంగళముగఁబాసికంబ । మర్చిరొప్పుగ ॥ కనుల ॥ మంగళసూత్రంబుఁగట్టె । మనుజసింహుండు । మంగళముగసీతమెడను । సంగతంబుగ ॥ కనుల ॥ మునులుమనుజపతులుమిగుల । మోదమందిరి । తనరఁగౌసల్యభాగ్య । ముమనుతించిరి ॥ కనుల ॥ భక్తిస్వస్తివాచకంబు । బాడిరప్పుడు । భక్తవత్సలునికినిదల । బ్రాలుపోసిరి ॥ కనుల ॥ దేవదుందుభిస్వరంబు । దివినిజెలఁగెను । దేవకన్యలాడిరపుడు। దివ్యనృత్యము ॥ కనుల ॥ దేవమందిరములుమిగులఁ । దేజరిల్లెను । దేవగణముసంతసమునఁ । దేలెనెంతయు ॥ కనుల ॥ ఆనం

దమ్మయ్యేపాకే । త్యాధినాయకు । ఆనందరాముశ । ల్యాణమొం
తయ్య ॥ కమల ॥ ౧౦౪॥

# పట్టాభిషేకము.

అఠాణారాగము - ఆదితాళము.

పల్లవి.

పట్టాభిరాముఁడయ్యెను । శ్రీరాముఁడు । పట్టాభిరాముఁ
డయ్యెను ॥

అనుపల్లవి.

పట్టాభిరాముఁడయ్యె । భక్తవత్సలుఁడునేడు । ఘట్టిగాశ
రణాగతులఁజేఁ । బట్టిపాలించుస్వామి ॥ పట్టాభి ॥

చరణములు.

* మంత్రపూతశుద్ధోదకంబుచే । మానుగసంశ్రితవ్రతులగు
మహర్షులు । సంతసమునఁజదుర్వేదాష్టకవై । ష్ణవసూక్తం
బులనభిషేకించిరి ॥ పట్టాభి ॥ దివ్యదుందుభులుదివిఘోషించెను ।
దివిజులుపుష్పవర్షమువర్షించిరి । దివ్యాభరణాదులచేసీతా । దేవి
తోరామునిశృంగారించిరి ॥ పట్టాభి ॥ సౌమిత్రిముదంబునఛ
త్రంబును । సామగమునుజేదోయిధరించెను । స్వామికినిరుపా
ర్శ్వంబులభరతుఁడు । శత్రుఘ్నుఁడువ్యజనంబులవిసరిరి ॥ పట్టాభి॥
అగ్రభాగముననద్దముఁబట్టెమ । హానందమునవిభీషణుఁడొప్పుగ ।
సుగ్రీవుఁడుపూర్ణోదకకలశము । సుందరముగధరియించెముదం

* శ్రీరంగమాహాత్మ్యేవిభీషణంప్రతిశ్రీరంగనాథోవాచ.
మామైవానుస్మరసదా । త్వామహంసంస్మరామిచ ॥

బున ॥ పట్టాభి ॥ వనమాలనుభల్లూకేశుఁడొసఁగ । కాలిత్రి త్రుఁడుతాంబూలమొసఁగ । హనుమంతుఁడుకీపముఁబట్టెను ధ్వజం । బునుముదమునననుసుషేణుఁడుపట్టెను ॥ పట్టాభి ॥ మహాత్ముఁడగురాముని బరివేష్టించి । మంత్రులుపాసించిరికడు ముదమున । శ్రీహరిసాకేతపురాధీశుని । జేరిసర్వలోకులునుతి యించిరి ॥ పట్టాభి ॥ ౧౦౫॥

---

## జగద్రక్షణచింత.

కాంభోజిరాగము - జంపెతాళము.

పల్లవి.

ఏమిచేతునావృత్తి । కెట్లుకొనసాగు ॥

అనుపల్లవి.

కామాంధులగునరుల । కష్టంబుదీర ॥ ఏమిచేతు ॥

చరణములు.

మూలప్రకృతినున్నయాత్మలనుగరుణించి । మొదటఁగరణక శేబరములనిచ్చితిని । చాలవానినెసాధనంబులుగఁజేసికొని । చనిరిదుర్మార్గమున నేమందునకటా ॥ ఏమిచేతు ॥ సదసద్వివేకం బుగల్గియుజ్జీవింప । శాస్త్రప్రదీపంబుఁగరుణనిచ్చితిని । ముద మునసుగడ తేరకద్దాననేవీరు । మూఢులైశలభంబులై వ్యర్థు లైరి ॥ ఏమిచేతు ॥ ఆజ్ఞనుల్లంఘించువారిపైదండెత్తు । నవనీ శులట్లు సేనవతరించితిని । అజ్ఞులైశ్రీరామదివ్యావతారముప । నటమానవబుద్ధి నెంచరించిచెడిరి ॥ ఏమిచేతు ॥ సకలాత్మలను బ్రోవసంకల్పముసుజేసి । సాకేతపురిఁబుట్టితదిపొంతుకానేల ।

ఆకలంకమగుకృపావృష్టి చేనెల్లరను । ఆమలులుగఁజేసియుక్తిక థంబుఁజేర్తు ॥ ఏమి చేతు ॥ ౧౦౮॥

తోడిరాగము - ఆదితాళము.

చరణములు.

భవరోగమునకుమందు । శివునికిఁదియ్యవివిందు । దివిజులు కోరుపొందు । రామ । దివ్యనామమిలయందు ॥ గిరిశునిచే వినిముందు । గిరిరాట్సుతముదమందు । ధరదీనిమహిమ నేమందు । దీనఁ । గరమును మోక్షంబందు ॥ ముక్తిప్రదమనివిందు । మునికృతగ్రంధములందు । ముక్తిమార్గమునందు । చను । భక్తిదీపమైముందు ॥ భుక్తినొసఁగునిహమందు । ముక్తినొసఁగుఁబరమందు । భక్తామృతమిలయందు । అని । భక్తులుపొగడెదరెందు॥ తారకమనఁబడునెందు । తద్దయుహృదయమునందు । కోరిజపింపుఁడుముందు । దీనిఁ । గోరమియమునికిసందు ॥ శ్రీకరతారకమందు । చేకురుసర్వమునెందు । సాకేతపురమునందు । దీన । సామీరిముదంబందు ॥ ౧౦౭॥

కాపిరాగము - అటతాళము.

పల్లవి.

హరేరామహరేరామరామరామహరేహరే । హరేకృష్ణహరేకృష్ణకృష్ణకృష్ణహరేహరే ॥

చరణములు.

అనయమునుగేశవునినారా । యణునిమాధవుఁబాడెద । తనరగోవిందువిష్ణుమధుసూ । దనుత్రివిక్రముఁ పాడెద ॥ హరే రామ ॥ వామనునిశ్రీధరుహృషీకేశుఁ । పద్మనాభునుతించెద । దామోదరుహృత్పద్మనిలయుని । దద్దయునుసురించెద ॥ హరే

రామ ॥ శ్రీరంగాధిపు వేంకటేశుని । వారణాచలవరదుని । కోటి శ్రీయదుశైలనాయకుఁ । గొల్తుసంపత్పుత్రుని ॥ హారేరామ ॥ భక్తవత్సలుని స్తలేశునిఁ । బరగఘటికాద్రివరహరి । భక్తిక్రీతు బృందావనేశునిఁ । బార్థసారధివందించెద ॥ హారేరామ ॥ పరగ మన్యుక్షేత్రపతిగో । పాలుదక్షిణవేంకట । గిరినిలయుశ్రీచోర నాయకుఁ । గీర్తింతునుసద్భక్తిని ॥ హారేరామ ॥ శ్రీమన్నారా యణునినరసఖు । శ్రీబదరికాశ్రమపతి । శ్రీమత్పండరివిఠ్ఠలేశు । నర్చింతుసాకేతేశుని ॥ హారేరామ ॥ ౧౦౮॥

యమునాకల్యాణిరాగము - అటతాళము - గొబ్బి.

పల్లవి.

ఆడుదమాగొబ్బియాడుదమామన । మందరుగుమిగూడిపాడుదమా ॥

అనుపల్లవి.

వేడుకతోహృదయాలయమునరామ । విభునిబూజయొనర్చివేడుదమా ॥ ఆడు ॥

చరణములు.

శాంతిజంబునగ్రుంకుదమాశ్రీ । శార్ఙ్గినినోరారఁబాడుదమా। దాంతియన్ధౌతవస్త్రముఁదాల్చిసద్గుణ । తతిభూషణములుగఁ బూనుదమా ॥ ఆడు ॥ వైరాగ్యతిలకంబుదిద్దుదమాజిత । మారునివరెన్నృత్యమాడుదమా । శ్రీరమ్యముగజ్ఞానమయమున హృదయ । చిత్రాలయముశుద్ధిచేయుదమా ॥ ఆడు ॥ విజ్ఞానరం గవల్లినిడిశాంతిని । వేద్కవితానంబుఁజేయుదమా । అజ్ఞాన తిమిరభాస్కరురామునత్యసిం । హాసనమునసెలకొల్పుదమా ॥ ఆడుద ॥ అనంతతీర్థముచేసభిషేకించి । యహింసాదిపుష్పము

లర్పించి । ఆనందసుజ్ఞానమయజీవనై వెస్య । మానందరాముని
కొసఁగుదమా ॥ ఆడుద ॥ సర్వభూతసమత్వమనువ్యజనము
చేసి । శ్రవణమననిధిధ్యాసములఁ । సర్వాత్మునికినర్ఘ్యపాద్యా
చమనములుగ । సంతతసద్భక్తినొసఁగుదమా ॥ ఆడుద ॥ భక్తి
నాకించిన్యతాంబూలమర్పించి । భక్తవత్సలునికనన్యగతిఁ ।
భక్తినీరాజనముగనిచ్చిసాకేత । భర్తవేవిధములఁబాడుదమా ॥
ఆడుద ॥

ఉసేనిరాగము - రూపకతాళము - హెచ్చరిక.

చ ర ణ ము లు.

దశరధరాజతనూభవ । దానవకులకాలా । మశకీకృతదశ
కంఠ । మహేశా హెచ్చరికా ॥ సీ । తేశా హెచ్చరికా ॥
సూర్యాన్వయదుగ్ధాంబుధి । సోమారఘురామా । సూర్యశశాం
కాక్షనృప । సోమా హెచ్చరికా । గుణ । ధామా హెచ్చ
రికా ॥ శరణాగతవత్సలశ్రీ । శార్ఙ్గధనుష్పాణే । కరుణాంబునిధే
సీతా । కాంతా హెచ్చరికా । అతి । దాంతా హెచ్చరికా ॥
శతమఖముఖసురవందిత । శశినిభముఖరామా । నతభక్తజన
ప్రియశ్రీ । నాథా హెచ్చరికా । మ । న్నాథా హెచ్చరికా ॥
అజవందితచరణాంబుజ । హాయసుందరవదనా । గజనాయకవ
రదరమా । కాంతా హెచ్చరికా । మ । త్యాంతా హెచ్చరికా ॥
సాకేతపురాధీశ్వర । సత్కృపలయసోమా । శ్రీకాంతాకుచభూ
షణ । శ్రీశా హెచ్చరికా । స । ర్వేశా హెచ్చరికా ॥

ఆనందభైరవిరాగము - లాలి.

చ ర ణ ము లు.

శ్రీరామచంద్రలాలి । మాయయ్య । సీతాధినాథలాలి । కారు
ణ్యజలధిలాలి । నాస్వామి । కమలాక్షలాలిలాలి ॥ దేవతలునిన్ను

వేద । దశరథ । భూవల్లభునిసుతుండై । శ్రీ వెలయుమునులఁగాచి నట్టిశ్రీ । దేవాధిదేవలాలి ॥ సీతయునులక్ష్మణుండు । ఎల్లప్పుడు । చేరివెనువెంటరాగ । నీతిజనకాజ్ఞనటవి । మెలఁగిన । నిర్జరాధి శలాలి ॥ గుహునిహనుమంతునేలి । సుగ్రీవుఁ । గూర్మిఁజేఁబట్టి వాలి । నహహాయొక్కమ్ముచేతఁ । గూల్చిన । యబ్ధిగంభీరలాలి॥ జలధిసేతువునుగట్టి । రావణునిఁ । జంపిసాకేతపురిని । వెలయ రాజ్యముచేసిన । రఘువీర । వేడ్కనన్బ్రోవులాలి ॥

## కాంభోజిరాగము - లాలి.

### చరణములు.

పరమపదమునసీవుపరగుచున్నావు । పరవాసుదేవుఁడై భాసురంబుగను । ఉరగేశగరుడసేనేశాదినిత్యు । లాప్తగాముక్తులునుబలసికొల్వగను ॥ లాలి ॥ క్షీరసాగరమందుశేషతల్పమున । నీరజాక్షాయోగనిద్రచేసెదవు । తీరుగాదేవతలమొరనాలకించి । తీర్చెదవువారికష్టములఁగరుణించి ॥ లాలి ॥ రామకృష్ణాదిదశరూపములదాల్చి । రక్షించిసాధువులదుష్టులను గూల్చి । ఈమహినిధర్మసంస్థాపనముచేసి । యెంతయునుదశదిశలఁగీర్తికెక్కితివి ॥ లాలి ॥ జీవాత్మదేహమందుండురీతిగను । చెలగమణులనుదాల్చుసూత్రంబువలెను । నీవఖిలమునవిండికరుణాబ్ధివగుచు । నేర్పుతోఁబ్రోచెదవుసకలజీవులను ॥ లాలి ॥ శ్రీరంగమునవేంకటాచలంబునను । వారణాద్రినియాదవాచలంబునను । శ్రీరమ్యముగనిస్తలాఖ్యపురమునను । జెలగఘటికాద్రివిహరించుమన్నాథా ॥ లాలి ॥ బృందావనమునశ్రీరుక్మిణినిగూడి । పాండుగాపార్థసారథివైయుండదేవా । అందముగదక్షిణశ్రీవేంకటేశా । అలపండరిపురిశసాకేతవాసా ॥ లాలి ॥

పంతువరాళిరాగము - సావు తాళము - మంగళము.

చ ర ణ ము లు.

సూర్యాన్వయాబ్ధిపూర్ణ । సోమాయరాఘవాయ । సూర్య చంద్రనేత్రాయ । సుభగమంగళం ॥ దేవరాజపూజితాయ । దివ్యసద్గుణాకరాయ । భావజారివందితాయ । భవ్యమంగళం ॥ దేవబృందరక్షకాయ । దేవమౌనిసంస్తుతాయ । రావణాంతకా యధీ । రాయమంగళం ॥ అఖిలలోకపూజ్యాయ । అంబుజాస నార్చితాయ । నిఖిలలోకరక్షకాయ । నిత్యమంగళం ॥ సనకాది వందితాయ । సౌమిత్రిపూజితాయ । దనుజకాలాయముక్తి । దాయమంగళం ॥ సౌమిత్రిపూర్వజాయ । సాకేతనాయకాయ । రామచంద్రాయవీ । రాయమంగళం ॥

అసావేరిరాగము - ఆదితాళము - మంగళము.

ప ల్ల వి.

శ్రీరామభద్రునికిజయమంగళం । మన । సీతామనోహరునికి శుభమంగళం ॥

అ ను ప ల్ల వి.

క్షీరాబ్ధిశయనునకును । శ్రీవత్సవక్షునకును । మారుతివంద్యు నకును । మదనునిజనకునకును ॥ శ్రీరామ ॥

చ ర ణ ము లు.

జనకజామార్తాండైన । స్వామికినిమంగళం । సనకాదివిను తుండైన । చక్రికినిమంగళం । మునియాగరక్షకునకు । మోహన రూపునకును । మనభాగ్యరాశియైన । మాభూనీళేశునకును ॥ శ్రీరామ ॥ దశకంఠకాలుండైన । తండ్రికినిమంగళం । పశుపతివం

ద్యుఁడై వ । భర్తకునుమంగళం । శశిసూర్యనేత్రునకును । శార్ఙ్గ కోదండునకును । దశరథపుత్రునకును । దానవాంతకునకును ॥ శ్రీరామ ॥ కారుణ్యజలధియైన । వీరునకుమంగళం । నారాయణాఖ్యుఁడైన । నాథునకుమంగళం । నీరజనాభునకును । నిర్జరపాలునకును । చారుచరిత్రునకును । సాకేతవాసునకును ॥ శ్రీరామ॥

సురటిరాగము - అటతాళము - మంగళము.

చరణములు.

శ్రీరంగనిలయుఁడై । చెలగునట్టినీకుమ్మంగళంశుభమంగళం । ధారుణివేంకట । ధరణీధరాలయమంగళంశుభమంగళం ॥ దంతిభూధరనాథ । ధరణీధరుఁడనీకుమంగళంశుభమంగళం । సంతతమునుయదు । శైలదివ్యాలయమంగళంశుభమంగళం ॥ శ్రీమన్నిస్తులనాథ । శ్రీభక్తవత్సలమంగళంశుభమంగళం । శ్రీమద్ఘటికాద్రీశ । శ్రీయోగనరసింహమంగళంశుభమంగళం ॥ శ్రీపార్థసారథే । శ్రీబృందావననిలయమంగళంశుభమంగళం । శ్రీపండరిపురీశ । శ్రీవిఠ్ఠలేశ్వరమంగళంశుభమంగళం ॥ శ్రీవైకుంఠేశ్వర । శ్రీచోరనాయకమంగళంశుభమంగళం । శ్రీవెలయుదుట్ల । శ్రీవేంకటాధీశమంగళంశుభమంగళం ॥ సాకేతేశ్వరుఁడగు । సజ్జనవత్సలమంగళంశుభమంగళం ॥ శ్రీకంఠార్చితపాద । శ్రీతారకనామమంగళంశుభమంగళం ॥

# ద్వాదశనామ తేవారములు.

కేశవారంగనాథాగీర్వాణార్చితపదాబ్జా । కౌశికమఖముఁ బ్రీతిఁగాచిరాక్షసులఁగూల్చి । ఈశానపద్మజామరేంద్రులమధ న్నినట్టి । శ్రీశనతునన్నునేలుశ్రీసాకేతాధినాథా ॥ ౧ ॥

నారాయణారమేశాసలిసజార్చితపదాబ్జా । శ్రీరంగదివ్యధామాశేషపర్యంకశాయి । నారదగానలోలనన్నేలుకరుణతోడ । శౌరిదేవాధిదేవాసాకేతపురవిహారా ॥ ౨ ॥

మాధవాప్రణవదివ్యమందిరనిలయరంగ । నాథవైకుంఠధామానన్నింద్రియములచేత । బాధపడకుండఁబ్రోచిపాపసంఖంబుఁద్రుంచి । సాధుబృందమునఁజేర్చుసాకేతపురవిహారా ॥ 3 ॥

గోవిందవాసుదేవాకుంజరభూధరేశా । గోవర్ధనాచలంబుఁగూర్మినెంకవ్రేలనెత్తి । గోవులనుగోపకులనుగొబ్బునగాచి నట్లు । శ్రీవెలయునన్నుఁబ్రోవుశ్రీసాకేతాధినాథా ॥ ౪ ॥

శ్రీవిష్ణుదేవభువనస్థితిలయసృష్టులరయ । దేవనీలీలలగును దీనవత్సలరమేశా । కావుముకరుణశరణాగతునన్నుఁగరమునరసి । శ్రీవేంకటాచలేశాశ్రీసాకేతాధినాథా ॥ ౫ ॥

మధుసూదనారమేశామరువకనీదుదివ్య । కథలనేవినఁగఁగోరుఁగరమునావీనులెపుడు । పృథివినేనురులవేదభృశముసీసేవవలతు । నధిపనన్నేలుమరసియవనిసాకేతనాథా ॥ ౬ ॥

త్రివిక్రమదేవనీదుదివ్యపాదోదకంబు । భవరోగభేషజంబు భక్తిముక్తిప్రదంబు । శివజటాభూషణంబుశివముగానాశోసంగి । భువినన్నుఁబరమకరుణఁబ్రోవుసాకేతనాథా ॥ ౭ ॥

వామనాసురసహాయావరము వేడెదనునిన్ను । కామాదిశత్రుపీడకరము నేనోర్వఁజాల । నీమహాత్మ్యంబునెఱిఁగి నిన్నే నేఁజేరికొల్తు । కామజనకా నన్నేలు కరుణ సాకేతనాథా ॥ ౮ ॥

శ్రీధరా చక్రపాణే శ్రీవత్సవక్షదంతి । భూధరశిఖరనిలయ పురుషోత్తమా మురారే । సాధుబృందమున నన్నుఁ జయ్యనఁ జేర్చి సీతానాథభృత్యునిగ నేలు నన్ను సాకేతనాథా ॥ ౯ ॥

శ్రీహృషీకేశ శౌరే శ్రీభూనీళేశ గరుడ । వాహనకమలనయన వరద నన్నేలుకొమ్మా । శ్రీహస్తిశైలనాథ శ్రీపుణ్యకోటినిలయా । శ్రీహరి కరుణఁజూడు శ్రీసాకేతాధినాథా ॥ ౧౦ ॥

పద్మనాభా మన్నాథ పాలింపు నన్నుఁ గరుణఁ । బద్మాలయాధినాథ పరవాసుదేవ హృదయ । పద్మంబునందు నిలిచి పార్థసారధి దయాబ్ధే । పద్మజార్చిత నన్నేలు పరగ సాకేతనాథా ॥ ౧౧ ॥

దామోదరా మురారే ద్వారకానగరవాసా । శ్రీమనోహరుఁడ నన్నుఁ జేఁబట్టియభయ మిమ్ము । నామనవిఁ జిత్తగింపు నా హృదయమున వసింపుఁ । గామాద్యరులను ద్రుంపు కరుణ సాకేతనాథా ॥ ౧౨ ॥

మంగళం మద్గురుభ్యోస్తు ।
తద్గురుభ్యోస్తు మంగళం ।
అస్మత్సర్వగురుభ్యోస్తు ।
నిత్యశ్రీర్నిత్యమంగళం ॥

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

శ్రీభక్తామృతము సంపూర్ణము.

ஸ்ரீ.

ஸ்ரீமதே ராமாநுஜாயநம:

# பஞ்சரத்நம்.

## கன்னட பியாகுராகம் - சாபுதாளம்.

### பல்லவி.

உயர்வற வுயர்நல முடையவனே
மயர்வற மதிநல மளித்தவனே
அயர்வறு மமரர்களதிபதியுன்
துயரறு சுடரடி தொழுவேனே.

### சரணங்கள்.

தயரதன் மகனுயுதித்தவனே
தவமுனி யாகத்தைக் காத்தவனே
தயையுடன் கல்லைப் பெண்ணாக்கிய வென்
தாய் தந்தை குரு தெய்வமானவனே (உயர்வற)

மிதிலா நகரை யடைந்தவனே
மதிசூடியின் வில்லை முறித்தவனே
சதிருடன் சீதைகைப்பிடித்தவனே
ஜமதக்னி புதல்வனை வென்றவனே (உயர்வற)

தந்தை யேவ வனமடைந்தவனே
தவசிகளாதித்யம் கொண்டவனே
வந்த விராதனைக் கொன்றவனே
வாமுனவரைக் கண்டு மகிழ்ந்தவனே (உயர்வற)

அத்திரி முனியை யடைந்தவனே
அகத்திய ரருள் பெற்று மகிழ்ந்தவனே
கத்தியாலரக்கி மூக்கறுத்தவனே
கரன் முதலோரைக் கொன்றவனே (உயர்வற)

கபந்தன் சாபத்தைத் தீர்த்தவனே
கருணை சபரிக்குப் புரிந்தவனே

அபயம் சுக்ரீவனுக் களித்தவனே
ஆஞ்சனேயனை யாண்டவனே (உயர்வற)
வாலியை யோரம்பால் வதைத்தவனே
வானரர்களைக் கூட்டிக்கொண்டவனே
நீலக்கடலை கடந்தவனே
நீராணிலங்கையில் புகுந்தவனே (உயர்வற)
தசமுகன் தலைகளைத் துணித்தவன் சோ
தரனுக் கிலங்கையை யளித்தவனே
தசரத நான்முக சங்கரனை
சசிபதியைக்கண்டு மகிழ்ந்தவனே (உயர்வற)
ஸாகேதபுரத்தை யடைந்தவனே
ஸாது ஜனங்களைக் காத்தவனே
ஸ்ரீதாரக மந்திர முன்
செங்கையா லென் றுவிலெழுதுவயே (உயர்வற)
ஸ்ரீராமா யென்னை யாண்டவனே
ஸ்ரீ சங்கரன் துதி மந்திரமாம்
தாரக நாமத்தை எனக் கருள்வாய்
தயையுடன் ஸாகேதபுரிக் கரசே (உயர்வற) க.

பியாகுராகம் - ரூபகதாளம்.

பல்லவி.

அஜ்ஞானமாகிய விருள் பரந்தோடுது
ஸுஜ்ஞான தீபத்தின்முன்.

அநுபல்லவி.

விஜ்ஞான தேசிகனும் வந்து காரணன்
வேதத்ரயாரணியைக் கடைந்திடவே (அஜ்ஞா)

சரணங்கள்.

மூன்று தாழியில் தயிர் கடைந்ததின் வெண்ணெய்
ஒன்றாகச் சேர்ப்பதுபோல்
மூன்று வேதம் கடைந்துண்டான வகாரதி
மூன்றெழுத்தைக் கூட்டி யொன்றாக்கினன் (அஜ்ஞா)
வய்யந்தகனியாவார் கடலே செய்யாய்
வெய்யக் கதிர்விளக்கை

செய்யச்சுடராழியானுக் களித்தனன்
பொய்கைப் பிறந்த பிரான் (அஞ்ஞான)

அன்பேதகளியாய் ஆர்வமே நெய்யாக
இன்புருகு சிந்தைத்திரியில்

நன்புருகி ஞானச் சுடர்விளக்கேற்றினன்
நன்மாதவிப்பூவிலுதித்தான் (அஞ்ஞான)

ஸாகேதபுரி வந்து தாரகமெனப்படும்
ஸன்மந்திர தீபத்தை

ஸ்ரீ கண்டனுக் களித்துலகத்தை வாழ்வித்தார்
ஸ்ரீராம தேசிகனுய் (அஞ்ஞான) உ,

செஞ்சுருட்டிராகம் - ஆதிதாளம்.

பல்லவி.

கருணைக்கடலே ஸ்ரீ கமலலோசன
அருள் புரிந்திடும் அகவிமோசன.

அநுபல்லவி.

வரமளித்தருள் ஸ்ரீ வைகுண்டாலயா
மருளைப்போக்குவாய் திவ்ய மாகலாலயா (கருணை)

சரணங்கள்.

தந்தை தாய் குரு தெய்வமாயினுய்
நந்தநந்தன நவினகாபனே

இந்திரேச கள்ளப்பிரனே என்
இருள் நசிக்க ஞானதீபம் தந்திடாய் (கருணை)

அலர்மேல் மங்கையை மார்பில் வைத்த ஸ்ரீ
அச்சுதா எனக்கபயந் தந்தருள்

மலர்பாதத்தை என் முடியில் வைத்தெந்தன்
மனதில் தங்கி ஜன்மத்தைப் போக்குவாய் (கருணை)

மந்மதாபவ என்ற மாதவா
மனதிலுள்ள கள்ளத்தைப் போக்குவாய்

நின்மலா புருஷோத்தமா ஹரீ
நிரஜாக்ஷ தக்ஷிணகிரீசனே (கருணை)

ஆனைக்கருள் புரிந்தாண்ட தேவனே
அகில லோகத்தை யுண்ட வாயனே

மானேயெய்த லாகேத நாதா உன்
மந்திரத்தை என்னுவிலெழுதுவாய் (கருணை) ௫.

## பியாகுராகம் - ரூபகதாளம்.

பல்லவி.

கள்ளப்பிறனெந்த னுள்ளத்திலே புகுந்
துள்ளப்பிறனையினன்.

அனுபல்லவி.

என்னுக்குளெண்ணேபோ லெங்கும் நிறைந்தெந்தன்
உள்ளமே யுறை கோயிலாய் (கள்ள)

சரணங்கள்.

காமக்ரோதாதி விரோதிகளறுவரும்
கடுநடை யிட்டோடினர்

ஸ்ரீமன்னாராயண சரண த்வயத்தையே
சேர்ந்து சரணமடைந்தேன் (கள்ள)

உயர்வற உயர்நலமுடைய வெம்பெருமானென்
மயர்வறுத்தாட்கொண்டனன்

அயர்வறுமமரர்க ளதிபதியானவன்
சுடரடிகள் தொழுதெழுவேன் (கள்ள)

சித்ர சரீர ரதத்தை யிழுக்கும் பஞ்
சேந்திரியா சுவங்கள்

பத்திரமாய் விஷய வீதியிலிழுக்காமல்
முத்தி பதத்திலேயே செய்தனன் (கள்ள)

லாகேதசக ருதித்துச் சாத்திரக்கையால்
ஸம்ஸாரார்ணவமக்னனை

ஸ்ரீகரமாயுத்தரிப்பித்துத் தந்தனன்
ஸ்ரீ யபயக் காத்தை (கள்ள) ௬.

## தேசிகதோடிராகம் - ரூபகதாளம்.

### பல்லவி.

தேவராக்ஷகா - ஸ்ரீ - தேவராஜனே
பூவராகனே - ஸ்ரீ - புஷ்கராக்ஷனே.

### சரணங்கள்.

தக்ஷிண ஸ்ரீசை-லத்தில்-தங்கி யுலகத்தை
ரக்ஷித்தருளுவாய் - ஸ்ரீ - ராமசந்த்ரனே (தேவ)

மார்பில் மங்கையை - வைத்த - மாராஜனகனே
சார்பெனக்கு நின் - கமல - சரண யுக்மமே (தேவ)

ஆகிஞ்சன்யமும் - பின்னும் - அனன்யகதித்வமும்
வேகமாயருள் - ஸ்ரீ - வேங்கடேசனே (தேவ)

கருணைக்கடலே நீ - எந்தன் - கஷ்டம் போக்குவாய்
வரதனே - ஸ்ரீலா - கேத - புரிவிஹாரனே (தேவ) ௫.

பஞ்சரத்நம் முற்றிற்று.

ஸ்ரீராமசந்த்ர பரப்ரம்ஹணே நம: